# TELUGU GRAMMAR

## FOR THE USE OF SCHOOLS

BY

T. VENKAYYA.

---

# ఆంధ్రవ్యాకరణము.

తా. వెంకయ్యచేత
చేయఁబడినది.

చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్‌వారిచేఁ
ప్రకటితము.

1916

*Authorized by the Director of Public Instruction.*

---

MADRAS:
**V. Ramaswamy Sastrulu & Sons**

---

**Government Copy-right.**
*All Rights Reserved.*

Third Edition:—5,0 00 Copies.

3 TPLA10DB200

# ఆంధ్ర వ్యాకరణము.

---

## సంజ్ఞాపరిచ్ఛేదము.

౧. శబ్దసిద్ధి లోకంబువలనఁ దెలియును.

౨. శాస్త్రంబు నియమము కొఱకు.

౩. సంస్కృతంబు ఆద్యప్రకృతి.

౪. ప్రాకృతంబు ద్వితీయప్రకృతి.

౫. ఆంధ్రభాష వికృతి.

౬. సంస్కృతభాషకు వర్ణంబులు ౫౦.

అందు అచ్చులు ౧౬.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ

అం అః.

ఇందు హ్రస్వములు ౫.

అ ఇ ఉ ఋ ఌ.

దీర్ఘములు. ౯.

ఆ ఈ ఊ ౠ ౡ ఏ ఐ ఓ ఔ.

ం ఇది అనుస్వారము.

ః ఇది విసర్గము.

హల్లులు ౩౮.

క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న,
ప ఫ బ భ మ, య ర ల వ
శ ష స హ ళ

కకారము మొదలు మకారముదనుక నుండు వర్ణములు స్పర్శము లనఁబడును.

ఇవి యైదువర్గములుగా భాగింపఁబడును.

కఖగఘఙ..................కవర్గము.

చఛజఝఞ.................. చవర్గము.

టఠడఢణ..................టవర్గము.

తథదధన..................తవర్గము.

పఫబభమ..................పవర్గము.

యరలవ..................ఇవి అంతస్థములనఁబడు.

శషసహ..................ఇవి ఊష్మములనఁబడు.

అఆకఖగఘఙహః....వీనికి ఉత్పత్తిస్థానము కంఠము.

ఇఈచఛజఝఞయశ..................తాలువులు.

ఋౠటఠడఢణరష..................మూర్ధము.

ఌౡతథదధనలస..................దంతములు.

ఉఊపఫబభమ..................ఓష్ఠములు.

ఙమఞణన..................నాసిక.

ఏ ఐ.........వీనికి ఉత్పత్తిస్థానము కంఠతాలువులు.
ఓ ఔ..................................కంఠోష్ఠములు.
వ....................................దంతోష్ఠములు.
ం....................................నాసిక.

౨. ప్రాకృతభాషకు వర్ణములు ౪౦.

అచ్చులు ౧౦.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః.

హల్లులు ౩౦.

క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న
ప ఫ బ భ మ య ర ల వ స హ ళ.

కొఱవడిన వర్ణంబులు ౧౦.

ఋ ౠ ఌ ౡ ఐ ఔ ఙ ఞ శ ష.

౩. దేశ్యతద్భవాత్మక మగునాంధ్రభాషకు
వర్ణంబులు ౩౬.

అచ్చులు ౧౪.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఁ ం.

హల్లులు ౨౨.

క గ చ ౘ జ ౙ ట డ ణ త ద న ప బ మ
య ర ల వ స హ ళ.

౯. అనాద్యంబులగు వర్ణంబులు ౬.
ఎ ఒ ఁ చే జే ఱ.

౧౦. ఋ ౠ ఌ ౡ ః ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ థ ధ ఫ భ శ ష
ఇవి తత్సమాన్యదేశ్యంబులం గలసి యాంధ్రంబునం జేరుచున్నవి.

ఉ. ఋషభుఁడు-ఖచరుఁడు-ఘనుఁడు-ఠవర-ఢాక మొదలైనవి.

---

అభ్యాసము.

క చ అ ట ఈ ఊ ఋ ర ల శ ష వ య హ
ఖ ఘ ఙ గ అ ౠ ౡ ఏ ఌ జ ఞ ఝ థ ద
త ధ మ ఫ భ వ బ ఇ ఉ ఏ ఓ ఐ ఔ ః ం ఁ
ఎ ఒ ఈ న స శ చ జ ఛ ట ణ ఠ ళ.

ఇం దచ్చు లెవ్వి? హల్లులెవ్వి? పరుషములెవ్వి? కంఠ్యములెవ్వి? దంత్యములెవ్వి? దీర్ఘములెవ్వి? హ్రస్వములెవ్వి? స్పర్శములెవ్వి? కవర్గమును జెప్పుము. అనునాసికములను జెప్పుము. అంతస్థములను జెప్పుము. శ ష స హ ఈవర్ణముల కేమి పేరు? శుద్ధాంధ్రభాషావర్ణము లెవ్వి? ప్రాకృతమునకుఁ దగ్గిన వర్ణములెవ్వి? దేశ్యతద్భవాత్మకమగునాంధ్రభాషకు వర్ణము లెన్ని? అవి ఎవ్వి? ఖ ఛ భ ఋ మొదలయినవి తెనుఁగున నెట్లుచేరును? కకార మెచటఁ బుట్టినది? విసర్గమునకు జన్మస్థాన మెద్ది? అనుస్వార మెచటఁ బుట్టినది?

---

౧౧. పూర్ణము ఖండము అని అనుస్వారము ద్వివిధము.

పూర్ణమును ఖండమును ఒక్కొక్కటియు సిద్ధము సాధ్యము నని ద్వివిధము.

అందము-చందము.......సిద్ధపూర్ణోదాహరణములు.
చెందొవ- కెందమ్మి.......సాధ్యపూర్ణోదాహరణములు.
కలఁగి - తొలఁగి......సిద్ధఖండోదాహరణములు.

వచ్చెఁగమలాక్షుఁడు
మెచ్చెఁదామరసాక్షుఁడు. } సాధ్యఖండోదాహరణములు.

౧౨. బిందువు తత్సమవ్యతిరిక్తము లయినయాంధ్రశబ్దముల యందుఁ బరుష సరళంబులకు ముందుగా నుండునుగాని తక్కిన వర్ణములకు ముందుగా నుండదు.

౧౩. హ్రస్వముమీఁదనున్న అరసున్న వైకల్పికముగా నిండుసున్న యగును. ఉ. కలఁగి-కలంగి. చెలఁగి - చెలంగి. దీర్ఘము మీఁదఁ గలిగినది అరసున్నగానే యుండును. ఉ. తాఁజెప్పెనేఁ జదివితి.

౧౪. అఁట-ఇఁక-చుఁడు అను శబ్దంబులందక్క మొదటి హ్రస్వంబుమీఁద అరసున్న యుండదు.

## అభ్యాసము.

ఈ క్రింది శబ్దములలోని సిద్ధ సాధ్య బిందువులను చెప్పుము. - లేక - వ్రాయుము.

ముందు - గొంది - పంట - చుంచు - చెంక - చెంచు - చెంది రము - చేఁతరాసి - కలఁత - జంగము - వెలుఁగు - పాఁడి - పాఁతు- గందము- చేఁప- చెంగలువ- కెందమ్మి- పొంబనఁటి - నేఁత గాఁడు - వచ్చెఁగమలాక్షుఁడు - చూచెఁదమ్ములను.

౧౫. య - ర - ల - వ ఈ యక్షరములు లఘువులు అలఘువులు అని రెండు విధములు గలవి.

అచ్చుకంటెఁ బరమయిన అచ్చునకు వచ్చిన యకారము లఘువు. ఉ. (మేన-అత్త) మేనయత్త.

తక్కినది అలఘువు. ఉ. చాయ - కాయ - బయలు - మొ.

అరదము - అరుదు - ఇత్యాదులయందలి రేఫము అలఘువు.

కలఁత - చలము - వలన - ఇత్యాదులయందలి లకారము లఘువు.

బహువచనము పరమయినప్పుడు - ర - ల - డ ఈ వర్ణములకు ఆదేశముగావచ్చిన ళకారము అలఘువు. ఉ. ఏళ్లు - గోళ్లు - పాళ్లు - త్రాళ్లు - మొ.

ప్రథమమిాఁది పకారమునకు ఆదేశముగా వచ్చిన వకారము లఘువు. ఉ. (రాముఁడు పలికె) రాముఁడు వలికె. (చెట్టు పడె) చెట్టువడె. మొ.

తక్కినది అలఘువు. ఉ. చేవ – కావరము. మొ.

యలవలకు లఘుత్వాలఘుత్వములు సంస్కృత ప్రాకృత వ్యాకరణములయందును గలవు. రేఫము తెనుఁగుభాషయందు మాత్రము ద్వివిధము.

---

### అభ్యాసము.

ఈక్రింది పదములనుండు లఘ్వలఘువులయిన యరలవల నేర్పరింపుము.

నాయము – సోయగము – చీయనుట – రామయ – చేయి యిచ్చెను–గురుతు–తెరఁగు – తరకలు – చారవప్పు – రాయంచ– రాలుట – రారా – పోరా – తొలుకరి – నిలుకడ – కులుకుట– రాళ్లు – బళ్లు – కోళ్లు – ఏళ్లు – సిళ్లు – వడియము–వరుస–వదినె– వాకిలి – నారువోసినవాఁడు నీరువోయకమానఁడు – అతఁడు వడియె.

౧౬. భూతార్థక క్రియాపదములయందును తద్ధర్మార్థక క్రియా పదములయందును నుండు యకార మెత్వము గలది. భూ - ఉ. కనియోఁ - చనియోఁ. త - ఉ. కనియెదుఁ - చనియెదుఁ. కని యెదు - చనియెదు.

౧౭. ఉయ్యేల - వయ్యేద - తాయెతు ఈ మూఁడు శబ్ద ములయందున్న మధ్య యకార మెత్వముగలది.

౧౮. ఆంధ్రభాషయందుఁ బదాదిని ణకార యకార శకార ములును - ఉ ఊ ఒ ఓ వీనితోఁ గూడిన వకారంబును లేవు. ఉ. ఇతఁడు-ఈతఁడు-ఉయ్యేల - ఉంగరము - ఊరు - ఓగిరము. మొ.

౧౯. తాలవ్యములు - దంత్యములు అని చజలు రెండు విధములు గలవి.

ఇ ఈ ఎ ఏ వీనితోఁ గూడినవి తాలవ్యములు. ఉ. చిగురు - చీర - చెంగు - చేవ ; జిగి - జీతము - జెముడు - జేగులు.

అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ వీనితోఁ గూడినవి దంత్యములు.

ఉ. చవి-చాన - చుట్టము - చూపు - చొప్పు - చోటు - చౌక ; జత - జాతర - జున్ను - జూదము - జొంపము - జోలి - జౌకు.

సంస్కృత ప్రాకృతములయందుఁ దాలవ్యములేకాని దంత్య ములు లేవు.

౨౦. దంత్యతాలవ్యములైన చ జ ల కు యతిప్రాసముల యందు మైత్రిగలదు.

ఉ. చేదలేటిబంగారుజలరుహంబులతూండ్లు - రాచవారు వడసి రాచరించి.

---

## అభ్యాసము.

ఈక్రింది పదములనుండు దంత్యతాలవ్య చజలను వ్రాయుము-లేక-చెప్పుము. చుక్క-చీమ. చొక్కము - జల్లెడ - జాణ - జున్ను-జడ్డిగము-జిత్తు-జంతిక-జూటు - చయ్యన - చలి జిలకఱ - జిల్లేడు-జల్లి-జేన-జొంపము-జొన్నలు.

---

## సంజ్ఞలు.

౨౧. ప్రాతిపదికము. నామము. ఉ. రామ - కృష్ణ - గోవింద, మొ.

ప్రత్యయము వర్ణకము. ఉ. డు-ము-వు-లు, మొ.

ధాతువు క్రియ. ఉ. పోషించు-భరించు-కొట్టు-తిట్టు. మొ.

అచ్చులు ప్రాణములు. అనుస్వారము బిందువు. ఏ ఓ ఋ వక్రములు. ఐ ఔ లు వక్రతమములు.

హల్లులు ప్రాణులు. క చ చే ట త ప లు పరుషములు. గ జ జే డ ద బ లు సరళములు. తక్కినవర్ణములు స్థిరములు, నకారము ద్రుతము.

౨౨. సుబంతములు-తిజంతములు - క్త్వాంతములు- తుము న్నంతములును ఈభాషయందుఁ బ్రయోగింపఁ దగవు. సు - ఉ. రామః-కృష్ణః మొ. తి-ఉ. భవతి-యాతి. మొ. క్త్వా - ఉ. భుక్త్వా-త్యక్త్వా. మొ. తు-ఉ. గంతుమ్-యాతుమ్. మొ.

౨౩. అవి అనుకరణమందుఁ బ్రయోగింపనగును. రామః అని-భుక్త్వా అని-గంతు మని. మొ.

---

౨౪. కళలు ద్రుతప్రకృతికములు అని తెనుఁగుశబ్దములు రెండు విధములు గలవి.

ద్రుత మంతమందు లేని శబ్దములు కళలు. ఉ-డు- ము-వు- లు అను ప్రథమావిభక్తియు, కూర్చి-కై -పట్టి-యొక్క విభక్తులును, పోషించితివి - పోషించితిరి ఇత్యాది మధ్యమపురుష క్రియలును, పోషించుచున్నారు - పోషించిరి ఇత్యాది రేఫాంత క్రియలును, పోషించుచున్నాము, పోషించితిమి ఇత్యాదిమాంత క్రియలును, ఇంచుక-కొంచెము ఇత్యాది కించిదర్థకములును, బళి - బాపురె ఇత్యాది ప్రశంసనార్థకములును, ఔర - ఆహా ఇత్యాది ఆశ్చర్యార్థకములును, అక్కట - కటకట ఇత్యాది సంతాపార్థకములును, అప్పుడు అను తదార్థకమును, ఎప్పుడు అను యదార్థకమును, ఏమి *అను కిమర్థకమును, అ-ఎ-ఏ అను ఏవా

ర్థకములును, ఊరక - మిన్నక అను తూష్ణీమర్థకములును, కద-కదా అను కిలార్థకములును, నుతించి-నుతింపక ఇత్యాదిక్త్వార్థక ములును. మొ.

ద్రుతమంతమందుఁగల శబ్దములు ద్రుతప్రకృతికములు.

ఉ. రామునిచేతన్-రామునియందున్-కన్-విన్-మొ.

---

అభ్యాసము.

ప్రాతిపదికమనఁగ నేమి? వర్ణకమన నేది? క్రియ లెవ్వి? బిందువననేమి? సరళము లెవ్వి? పరుషము లెవ్వి? ఆంధ్రమున ప్రయోగింపఁగూడని పదము లెవ్వి? అవి ఎట్లు ప్రయోగింప నగును?

వాఁడు-వానిన్-చెట్లు - తోఁటన్ - చనెన్-ఈనున్ - అగ్ని-ఇందు ద్రుతప్రకృతికము లెవ్వి? కళ లెవ్వి?

కళలకు గ్రంథమందుఁ జెప్పిన చొప్పున నీ క్రిందిపదములకుఁ బేళ్ళను వ్రాయుము-లేక-చెప్పుము. చూచితిమి - వచ్చుచున్నారు-కటకట-బళి-మిన్నక - కద-అప్పుడు - చూచెదవు - కూర్చి-పట్టి-ఏమి-ఎ-అ-కొంచెము.

---

౨౫. తద్భవము-తత్సమము - దేశ్యము - గ్రామ్యము అని ఆంధ్రభాష నాలుగువిధములు గలది.

సంస్కృత ప్రాకృతంబులవలనఁ బుట్టినది తద్భవము.

సంస్కృత ప్రాకృత భాషాసమము తత్సమము.

లోకవ్యవహారసిద్ధము దేశ్యము.

లోకవ్యవహారసిద్ధమై శాస్త్రవిరుద్ధమైనది గ్రామ్యము.

౨౬. తద్భవమనఁగా వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయము లను శాస్త్రప్రకారము పొంది వ్యవహరింపఁబడునది.

అది సంస్కృతభవము ప్రాకృతభవ మని ద్వివిధము.

ఉ. చందురుఁడు-సంద్రము ఇవి మొ. సంస్కృతభవములు.

ఉ. పవడము-కంచు ఇవి మొ. ప్రాకృతభవములు.

౨౭. తత్సమ మనఁగా ఆంధ్రవిభక్తివల్లనే నవికారముగలది. అది సంస్కృతసమము ప్రాకృతసమమని ద్వివిధము.

ఉ. రాముఁడు-శంభువు ఇవి మొ. సంస్కృతసమములు.

ఉ. సిరి-రాణి ఇవి మొ. ప్రాకృతసమములు.

౨౮. దేశ్యము-ఆంధ్రదేశ్యము-అన్యదేశ్యము-అని ద్వివిధము.
ఉ. తల్లి-తండ్రి ఇవి మొ. ఆంధ్ర దేశ్యములు.

అన్య దేశ్యము ఆంధ్రవర్ణయుక్తము-అనాంధ్రవర్ణయుక్తము-అని ద్వివిధము.

ఉ. కావి - మోవి ఇవి మొ. ఆంధ్రవర్ణయుక్తములు.

ఉ. కావు - రవర ఇవి మొ. అనాంధ్రవర్ణయుక్తములు.

౨౯ - గ్రామ్యము నింద్యగ్రామ్యము - అనింద్యగ్రామ్యము అని ద్వివిధము.

ఉ. వస్తాఁడు-పోతాఁడు-ఇవి మొ. నింద్యగ్రామ్యములు.

ఉ. కలకంఠుఁడు - ప్రాణగొడ్డము ఇవి మొ. అనింద్యగ్రామ్యములు.

౩౦. ఈభాషయందు కవిసమయ సిద్ధంబైనపదము ప్రయోగింపవలయును.

---

## అభ్యాసము.

ఈ దిగువ నుదాహరించిన పదములందు తత్సమ తద్భవ దేశ్య గ్రామ్యములను వివరింపుము.

పవడము-జగత్తు - ఇంగలము - పాలు - చూచేని- జన్నము-ఖడ్గము- వ్రాస్తాఁడు-తల్లి-గృధ్రము - గద్ద - నిద్దుర - గుడి-కోట-పేట - గాదిలి - సుద్ది - వెన్నుఁడు-జన్నిదము-పన్నిదము- కవాటము - కావు - లక్క - వడుగు - భువి - విద్య-సాము- లక్ష్మి.

సంజ్ఞాపరిచ్ఛేదము సంపూర్ణము.

---

## సంధిపరిచ్ఛేదము.

౧. అకారమునకు అచ్చుపరంబగునపుడు సంధిబహుళము. ఉ. మేనత్త-మేనయత్త; చింతాకు-హంసయేది - చెలువుండయిట రమ్ము. మొ.

౨. మధ్యమపురుషంబునందు ఇకారమునకు అచ్చుపరంబగునపుడు సంధి నిత్యము. ఉ. సేవించితి వచ్యుతుని. మొ.

౩. ప్రథమోత్తమపురుషంబులయందు సంధి వైకల్పికము. ఉ. వచ్చి రమరులు-వచ్చిరియమరులు - వచ్చితిమిపుడు-వచ్చితిమియిపుడు. మొ.

౪. క్త్వార్థక ఇకారమునకు సంధిలేదు. ఉ. వచ్చియిచ్చెను-చేసి యడిగెను. మొ.

౫. అది-అవి-ఇది-ఇవి-ఎది-ఎవి-ఏది-ఏవి అను నీశబ్దముల యందలి ఇకారమునకు అచ్చుపరంబగునపుడు సంధి వైకల్పికము. ఉ. అదేమి-అదియేమి. మొ.

౬. ఏమి మొదలగు శబ్దంబుల ఇకారంబునకు అచ్చుపరంబగునపుడు సంధివైకల్పికము. ఉ. ఏమయ్యా - ఏమియయ్యా-హరికిచ్చె-హరికినిచ్చె-మఱేమి-మఱియేమి. మొ.

౭. ఉకారమునకు అచ్చుపరంబగునపుడు సంధి నిత్యము. ఉ. రాముఁ డతఁడు - సోముఁ డితఁడు మొ.

౮. ప్రథమేతర విభక్తులయందుండు ఉకారమునకు సంధి వైకల్పికము. ఉ. నన్నేలె-నన్ను నేలె- నాకొఱకిచ్చె - నాకొఱకు నిచ్చె-నా కనురక్తుఁడు - నాకు ననురక్తుఁడు-నాయందనురక్తి - నాయందు ననురక్తి. మొ.

౯. నన్ను మమ్ములకు ద్విత్వ లోపంబునందు సంధి లేదు. ఉ. ననునేలె - మముమేలె.

౧౦. వర్తమానార్థక చువర్ణక ఉకారమునకు అచ్చుపరం బగునపుడు సంధి వైకల్పికంబు. ఉ. వచ్చుచుండెఁ - వచ్చుచు నుండెఁ. మొ.

౧౧. వాక్యవిరామమందు ఉకారమునకు అచ్చుపరంబగు నపుడు సంధి లేకున్నను దోషంబులేదు. ఉ. పడగనున్న హనుమ భయవిహ్వలుఁడుగాఁడు - అరదమునకు. మొ.

౧౨. పరిమాణార్థక మయిన ఏఁడు వర్ణకము పరంబగునపుడు సమస్తప్రాణములకు సంధి నిత్యము. ఉ. బారెఁడు - ఫుట్టెఁడు- తూమెఁడు - గోనెఁడు. మొ.

ఈ ఏఁడు పరంబగునపుడు దోసిలి మొదలగు శబ్దములయం దున్న లివర్ణమునకు లోపము నిత్యముగా నగును. ఉ. దోనెఁడు- గుప్పెఁడు- పట్టెఁడు- పిడికెఁడు, మొ.

౧౩. ఆ-ఈ-ఊ-ఏ-ఐ-ఓ-ఔ ఈ యచ్చుల కచ్చులు పరంబు లగునపుడు సంధిరాదు. పరమయిన అచ్చునకు యకారము

వచ్చును. ఇదియె లఘు యకారము. ఉ. మాయావు- మాయి ల్లు- కుహూయనియె- రేయెండ- మైయెుఱవు- రోయీవి- గ్లా యుదయించె. మొ.

---

## అభ్యాసము.

ఈదిగువనుదాహరించిన వాక్యములయందలి సంధులకు నిమి త్తములయిన సూత్రములను వ్రాయుము- లేక- చెప్పుము.

వాఁడు చేయకుండఁడు-నీవు చేసితివని వింటిని - వారు వచ్చి రనిచెప్పితిరి-లెస్సయినమాటచెప్పితివి-అదేమి-వారు మేము చూ చితిమనిరి-ఇదెవతె - రాజు బ్రాహ్మణులకొఱకు పాయసమిచ్చెను- నిన్నడుగుటకంటె నూరకుండుట మేలు - చూచుచుండినవా రెవరు - వారియందట్టిగుణములు లేవు - పుటికెఁడు బియ్యము కొనిపోయెను - రాముఁడ యిందుండుము - మీ యాపదలు విడిచినవి.

---

౧౮. ఏనిశబ్దముయొక్క ఇకారమునకు లోపమువైకల్పికము గానగును. ఉ. రామునేఁ గొల్చెద-రామునేనిఁగొల్చెద. మొ.

౧౯. వర్తమానార్థకచువర్ణకము పరమగునపుడు నువర్ణము యొక్క ఉకారమునకు లోపము వైకల్పికముగ నగును. ఉ. అనుచు-అన్చు - వినుచు - విన్చు-ఆ నకారమునకు నిందుసున్న

వైకల్పికముగా నగును. ఉ. అంచు - వించు. మొ. చనుచు-పూనుచు ఇత్యాదులయందు కలుగదు.

౧౬. సమాసమందు అది - అవి శబ్దముల అకారమునకు లోపము వైకల్పికముగా నగును. ఉ. గొప్పది-గొప్పయది-నీది-నీయది - నీవి - నీయవి. మొ.

౧౭. అపుడు - ఇవుడు - ఎవుడు అను నీశబ్దముల వువర్ణము యొక్క ఉకారమునకు లోపము వైకల్పికముగా నగును. ఉ. అపుడు - అప్డు - ఇవుడు - ఇవ్డు - ఎవుడు - ఎప్డు.

౧౮. ఆమ్రేడితమందు మొదటిపదమునకు అచ్చుపరంబగు నపుడు అంత్యవర్ణము లోపించును. ఉ. ఓహోహో-ఔరౌరా. మొ.

ఆమ్రేడితమనఁగా రెండుమాఱు లుచ్చరించుమాట.

౧౯. నమః ప్రభృతి శబ్దములకు అనుకరణంబునందు విసర్గము లోపించును. ఉ. రామాయనమ యనియె - త్వమేవగతి యనియె. మొ.

౨౦. నమశ్శబ్దమునకు ఓత్వంబును నగును. ఉ. రామాయ నమో యనియె.

అనుకరణమనఁగా అనుధాతువుతోఁ జేర్చి చెప్పట.

౨౧. ద్రుతప్రకృతికమునకు సరళవర్ణము పరమగునపుడు ఆద్రుతమునకు లోపసత్వపూర్ణ బిందుశ్లేషములలో నేదై

నను, స్థిరము పరమగునపుడు బిందువు తప్ప కడమ మూటిలో నేదైనను వచ్చును. ఉ. వచ్చె గదాధరుఁడు - వచ్చెను గదాధరుఁడు-వచ్చెంగదాధరుఁడు - వచ్చెన్గదాధరుఁడు; ఇచ్చెధనము-ఇచ్చెనుధనము - ఇచ్చెన్ధనము. మొ.

౨౨. ప్రథమ ప్రాస్వంబుకంటెఁ బరంబుగ నర్ధబిందువును-నకారలోపంబును గలుగవు. ఉ. చెంగల్వ-కన్దోయి. మొ.

౨౩. అచ్చు పరం బగునపుడు ద్రుతంబునకు లోపసంశ్లేషంబులు గలుగవు. ఉ. అనవుడు నిట్లు - నావుఁడు నాతఁడు-చేయుచున్నాఁడు. మొ.

౨౪. సమానంబులందంతట ద్రుతంబునకు లోపంబుగలుగును. ఉ. ఎల్లపాపములు. మొ.

౨౫. సమాసమందు ద్విత్వసహితములయిన-ను-లువర్ణముల ప్రథమాక్షర లోపము వైకల్పికముగా నగును. ఉ. కన్నదోయి-కనుదోయి-ముల్లుకంప-ములుకంప. మొ.

అచ్చుపరంబగునవు డీలోపంబులేదు. ఉ. మిన్నేఱు - కన్నాకు. మొ.

౨౬. ఒకానొకచోట నితరస్థలమందును నీలోపంబు గలుగును. ఉ. ఇల్లునేరె-ఇలునేరె - కన్నుమూసె-కనుమూసె. మొ.

౨౭. వాక్యంబుల తుదనుండెడి పదంబుల ద్రుతంబునకు లోపము వైకల్పికముగా నగును. ఉ. అలరెనెత్తావి కేలీవనాగ్రసీమ - సాత్యవతేయుఁగొల్చెదఁ. మొ.

౨౮. పదంబుల నడుమనుండెడు - న - ల - డ మొదలగు వర్ణంబులకంటెఁ బరంబగు ఉకారమునకు లోపము వైకల్పికముగా నగును. ఉ. పునుక - పున్క, కినుక - కిన్క, చిలుక - చిల్క, కడుపు - కడ్పు. మొ.

౨౯. మఱికొన్ని యచ్చులకుఁ బ్రామాణికప్రయోగముల వలన లోపంబు వైకల్పికముగాఁ గానఁబడుచున్నది. ఉ. ఉనికి - ఉన్కి, కలికి - కల్కి, బుడిపి - బుడ్పి, ఉంగరము - ఉంగ్రము. మొ.

---

## అభ్యాసము.

ఈ క్రిందివాక్యములలో నుండు ద్రుతలోపాదులకు నిమిత్తములయిన సూత్రములను వ్రాయుఁడు.

వానినే నిన్నేనంపినఁ గార్యమగును - వ్రాయుమనుచు నేఁ జెప్పితి మంచిదన్చు వాఁడు పల్కె - వచ్చునంచు నేఁజూచితి - మామిడికాయలు గొప్పవి - నిమ్మకాయలు చిన్నయవి - వాఁడప్డు చెప్పినమాటలు వినఁడు - ఔరౌర యెంతమాట పుట్టెను - బ్రాహ్మణాయనమ యనియె - నమోనారాయణాయయనుచు భక్తులు పల్కిరి - వచ్చె నల్లనిదొర - చూచెను లక్ష్మణుఁడు - నిల్చెం

గొరవముతోడ - నవ్వొన్జెలివెల్లవాఱి - చెంగలువలు గోసి కన్దోయినద్దుకొనియె-వానియాకృతి యందమయినది - నేవింతు ననంతుని-ములుకంప పై వ్రేసిన వస్త్రముమెల్లన వెలార్పుము - కనుఁగవ లెరియంగఁగార్చిచ్చుచూచె - మిన్నేటిజలములు వన్ను గాఁదెచ్చి-వానిఁగొల్చెదను-నిన్ను నమ్మెదను - కిన్కతోడఁ బోడగనె - ఉంగ్రము చిటికెనవ్రేల నుంచుము.

౩౦. తద్ధర్మార్థక క్రియాజన్యవిశేషణముయొక్క ఉకారమునకు అచ్చు పరంబగునపుడు నకారం బంతాగమంబుగా వచ్చును. ఉ. వచ్చు నచ్యుతుఁడు - వచ్చెదు నచ్యుతుఁడు. మొ.

౩౧. షష్ఠీసమాసమందు ఉకారాంత పదమునకు అచ్చు పరంబగునపుడు నకారం బంతాగమంబుగావచ్చును. ఉ. రామునాజ్ఞ - మోమునందము.

౩౨. ఋకారాంతపదంబునకు నట్లయగును. ఉ. విధాతృనాజ్ఞ - దాతృనౌదార్యము. మొ.

౩౩. సమాసమందు ఉకారాంత పదములకు పరుషసరళంబులు పరంబులగునపుడు నకారం బంతాగమంబుగా వచ్చును. ఉ. గండుంగోయిల - తళుకుంజెక్కులు - మురువుంజెక్కులు - సొగసుందలిరులు - అలరుం జొంపములు. మొ.

ఈ నకారాగమము అందు-కూర్చి-పట్టి విభక్తులు పరంబులగునపుడు చేసి పరంబగునపుడును తన వర్ణకంబు పరంబగు

నపుడును పుంప్వాది వికారంబులకంటెఁ బరంబుగను వచ్చును. ఉ. వనమునందు-వర్షముంగూర్చి జపము-జ్ఞానముంబట్టి మోక్షము-భక్తింజేసిజ్ఞానము-చక్కఁదనము-సరసంపుంబలుకులు. మొ.

38. సమాసములయందు ఉకారాంత పదంబులకు అజాదులగు సమానాధికరణ శబ్దంబులు పరంబులగునపుడు టకారం బంతాగమంబుగా వచ్చును. ఉ. చిగురుటాకు - కఱకుటమ్ము. మొ. చిగురాకనియుం గలదు.

ఈ ఆగమంబు అసమానాధికరణంబులందును గలుగును. ఉ. వేల్పుటావు. మొ.

39. కర్మధారయసమాసమునందు ఆలుశబ్దము పరంబగునపుడు ఉకారంబును దానిమీఁద రేఫాగమంబును వచ్చును. ఉ. ధీరురాలు - గుణవంతురాలు. మొ.

ఉకారంబు దేశ్యంబులం దఱుచుగాఁ గలుగదు. ఉ. పేదరాలు-బాలింతరాలు; పగతురాలు. మొ. కొన్నియెడల ముందుండిన ఉకారంబుమీఁద రేఫాగమము మాత్రము గానంబడుచున్నది. ఉ. గొడ్డురాలు - వియ్యపురాలు. మొ.

బొమ్మ అను శబ్దమునకు ఇల్లుశబ్దము పరంబగునపుడు రేఫంబంతాగమంబుగా వచ్చును. ఉ. బొమ్మరిల్లు.

40. సమాసమందు చేత-తోడ-వలన విభక్తుల యంత్యవర్ణములను ఇకారాదేశంబు వచ్చును. ఉ. నీచేతిపోరు - వాని

తోడి చెలిమి - నావలని నేరము- మొ. ఇదియె అలుక్సమాస మనఁబడును.

38. అందు అను సప్తమీవిభక్తికిని - ఇందునకును అలి యను నాగమంబు వచ్చును. ఉ. బిడ్డయందలి దయ - అందలి హేమసౌధములు - ఇందలి రత్నసానువులు. మొ.

39. అనుకరణంబునందు అహమాదిశబ్దముల మకారము నకు ద్విత్వము వైకల్పికముగా నగును. ఉ. దాసోహమ్మనియె. దాసోహమనియె. మొ.

39. మకారేతర హల్లునకు ద్విత్వము నిత్యముగా నగును. ఉ. పాయాత్తనుచు. మొ.

40. పడ్వాదులు పరంబగునపుడు ప్రథమావిభక్తిమువర్ణ కమునకు నిండుసున్నయు-లోపంబును వైకల్పికముగా నగును. ఉ. భయంపడు - భయపడు - భయముపడు. మొ.

41. కర్మధారయసమాసమందు విభక్త్యేకవచనమున విధిం పఁబడిన మువర్ణకమునకు పువర్ణకంబును పూర్ణబిందుపూర్వకపు వర్ణకంబును వచ్చును.ఉ.సరసపుఁబలుకు సరసంపుఁబలుకు. మొ.

42. బహువచనంబునందును నగును. సరసపుఁబలుకులు - సరసంపుఁబలుకులు. మొ. మువర్ణకంబుచేఁ బువర్ణకంబును గ్ర హింపఁబడుచున్నది.

43. ద్రుతప్రకృతికమునీఁది కచటతపలకు నిత్యంబుగ గజ డదబ లాదేశములగును. ఆద్రుతమునకు సున్నయు సత్వంబును

వైకల్పికముగా నగును. ఉ. వచ్చెఁ గమలాక్షుఁడు - వచ్చెంగమలాక్షుఁడు - వచ్చెనుగమలాక్షుఁడు-వచ్చెఁగమలాక్షుఁడు. మొ.

౮౮. ప్రథమమీఁది కచటతపలకు గసడదవ లాదేశంబులగును. ఉ. రాముఁడు గరుణాభిరాముఁడు-హరి సనుదెంచె - గోపాలుఁడు డక్కులాఁడు - రాముఁడు దారకనాముఁడు - హరి వోషించె. మొ.

౮౯. తాను-నేనుశబ్దములమీఁది కచటతపలకు గసడదవలు రావు. అవి ద్రుతప్రకృతికములు గాన గజడదబలే వచ్చును. ఉ. తాఁజెప్పె-నేఁ జదివితి. మొ.

౯౦. తత్సమవ్యతిరిక్తములయిన తెనుఁగు శబ్దములమీఁది తత్సమ శబ్దముల కచటతపలకు గసడదవలు రావు. ఉ. అతఁడు కరుణించె - తండ్రి చంద్రధరుఁడు - ఇతఁడు టంకాయుధుఁడు- వాఁడు తామరసాక్షుఁడు. వీఁడు పావనుఁడు. మొ.

౯౧. ద్వంద్వసమాసమందుఁ బదంబుకంటెఁ బరంబులగు కచటతపలకు నిత్యముగా గసడదవ లాదేశములగును. ఉ. అరిగోరులు - కాలునేతులు - టక్కుడెక్కులు-తల్లిదండ్రులు-ఊరువల్లెలు. మొ.

## అభ్యాసము.

క్రింది వాక్యములనుండు ఆగమాదులకు విధాయకములయిన సూత్రములను జెప్పుము - లేక - వ్రాయుము.

వచ్చునన్నుఁజూచి యిచ్చకమాడెను-రాజునాజ్ఞచే భటులు జగడమాడిరి - విధాతృ నాజ్ఞమీఱ నెవనికి శక్యము - విధాతృ ననుమతిని వాల్మీకి రామాయణంబుఁ జేసె - ఉపవనంబునకుంజని యులరుంజొంపములను గండుఁగోయిలలను జూచి తళుకుం జెక్కుల తలిరుఁబోండ్లు తల్లడిల్లిరి-సుకృతవిశేషంబున సౌందర్యంబును సరసంపుం బల్కులును గల్గును - విరహులు మదనుని కఱకుటమ్ములకు బెగడిరి - సజ్జనులు గుణవంతురాండ్రఁ బొగడుదురు-ధీరురాలు వ్యసనంబులఁ జిక్కదు - వానివలని భయము నాకెన్నఁడును లేదు-వారికి వారియందలి ప్రేమ యసదృశము-ఈసునఁబొందలెదు రాధకు దాసోహమ్మనుచు నందతనయుఁడు పల్కె-నీవు వానికి భయంపడకుము - వాఁడు వోయెను - నీవు చెప్పినదేమి-తాఁజెప్పినది తనకే తెలియదు - నీవు పావనుఁడవు-అక్క నెల్లెండ్రసొంపు నెప్ప నలవికాదు.

సూత్రములను జెప్పుచు నీక్రింది తప్పులను దిద్దుము.

దానికి కలిగిన సంపద జెఱుపునకుఁ గారణమాయెను - యోగ్యురాలు యెవతె-ధాత్రనుమతిని దక్షుఁడు ప్రజల సృజించెను-విరసము మాటలు పల్కవలదు - అన్నతమ్ములాడుచున్నారు-

వాఁడు వాండు పుత్త్రులంజూచె-నేను సెప్పినది వానికి యింపు గాదు - బొమ్మయిండ్లు పొలుపుగనున్నవి - పొదయిండ్ల దూఱకుము - కూరకాయలు తెప్పింపుము. పూవమ్ములు మారునివి.

---

౨౮. ఆంధ్రభాషయందు టి-ంటి-తి మొదలయినవి ఔప విభక్తికములను పేరుగలవి. ఇవి విభక్తిపరంబగునపుడును సమాసమందును నామముల రు-ఱు-ల్లు-డు-లి-న్ను-యి మొదలగు వానికి వచ్చును. ఉ. నీరు-నీటిని-నీటివెల్లువ; ఏఱు-ఏటికి-ఏటికాల్వ; విల్లు-వింటికి-వింటినొవ్వు; కూడు-కూటికి-కూటికుండ; అంబలి - అంబటికి - అంబటినీళ్లు; కన్ను - కంటికి - కంటితుద; నేయి - నేతికి - నేతికుండ. మొ.

కొన్నియెడల విభక్తి పరంబగునపుడుమాత్రము వచ్చును. ఉ. మిన్ను-మింటికి - మిన్నేఱు; పుడిసెడు - పుడిసెంటికి - పుడిసెఁడునీళ్లు. మొ.

కొన్నియెడల సమాసమందుమాత్రము వచ్చును. ఉ. పాము-పామునకు-పాఁపఱేఁడు; వేము-వేమునకు-వేఁపచెట్టు. మొ.

కొన్నియెడల సమాస విభక్తుల రెంటను గలుగవు. ఉ. పైరు-పైరునకు - పైరుజొంపము; కల్లు - కల్లునకు - కల్లుకుండ; ఎన్ను-ఎన్నునకు-ఎన్నుగంట. మొ.

---

## అభ్యాసము.

ఔపవిభక్తికములన నెవ్వి? అవి యెప్పుడు వచ్చును? కన్ను శబ్దమునకు ద్వితీయాద్యేకవచనములు చెప్పుము? వింటఁ అనునది యే విభక్తి? నేయి-నూయి-గోయి-రాయి-వాయి-చేయి ఈ పదములు మఱియొక పదముతో సమసించునపుడు ఔపవిభక్తికములు వచ్చునట్లు చెప్పుము.

సంధిపరిచ్ఛేదము సంపూర్ణము.

---

## అజంతపరిచ్ఛేదము.



౧. డు-ము-వు-లు-ప్రథమావిభక్తి.
ని-ను-ల-కూర్చి-ద్వితీయావిభక్తి.
చేత-చే-తోడ-తో-తృతీయావిభక్తి.
కై-కొఱకు-చతుర్థీవిభక్తి.
వట్టి-వలన-కంటె-పంచమీవిభక్తి.
కి-కు-యొక్క-లోపల-షష్ఠీవిభక్తి.
అందు-న-సప్తమీవిభక్తి.

౨. ఓయి-సంబోధనార్థకావ్యయము.

ఓయి పదంబునందలి యివర్ణంబునకు మహదామంత్రణంబున వైకల్పికంబుగా - అమహదామంత్రణంబున నిత్యముగా లోపంబు గలుగును. ఓయి రాముఁడ-ఓ రాముఁడ-ఓ చెలి - ఓ మృగము. మొ.

3. నీచత్వమిత్రత్వంబు లర్థంబులగునపుడు పుంవాచకంబున రి అనియు - స్త్రీవాచకంబున సి యనియు ఆదేశంబులగును. ఉ. ఓరి దురాత్మ-ఓరి చెలికాఁడ - ఓసి దురాత్మురాల - ఓసి చెలి. మొ. ఓ-ఓయి-ఓరి-ఓసి వీనిఁ బదాదియందుఁ బ్రయోగించునది.

సంబోధనంబున రో అను నవ్యయము స్త్రీవాచకంబులకుఁ బరంబుగ వచ్చును. ఉ. అక్కరో. చెలియరో. మొ.

౪. స్త్రీలు తిర్యగ్జంతువులు అచేతనములు అమహత్తులు-ఇతరములు మహత్తులు.

అమహచ్ఛబ్ద విశేషణములు అమహత్తులు - మహచ్ఛబ్ద విశేషణములు మహత్తులు.

౫. విభక్తి పరంబగునపుడు మహచ్ఛబ్ద సంబంధియగుఅంత్య అకారంబునకు ఉకారంబాదేశంబగును. ఉ. రామ-రాము. మొ.

౬. పుంలింగమందు ఇకారాంత వ్యతిరిక్త మహచ్ఛబ్ద సుప్రత్యయంబునకు బిందు పూర్వక డువర్ణకంబు వచ్చును. ఉ· రాముఁడు-రాముండు. మొ.

౭. కొన్ని అమహచ్ఛబ్దంబులకు మహద్వివక్షయందు అట్టి డువర్ణకంబు వచ్చును. ఉ. సముద్రుఁడు-మేఘుఁడు. మొ.

౮. సంబోధన ప్రథమైకవచనంబునకు అంతమందు అదాగమంబును బహువచనంబునకు ఆరదాగమంబును వచ్చును. తకార ముచ్చారణార్థము. ఉ. ఓ రాముఁడ-ఓరాములార. మొ.

౯. వీనికి దీర్ఘంబు వైకల్పికంబుగ నగును. ఉ. ఓ రాముఁడా-ఓరాములారా. మొ.

౧౦. కొందఱు సంబోధనంబున డువర్ణకము లేదందురు. ఉ. ఓ రామ-ఓ రామా. మొ.

౧౧. లాంతవ్యతిరిక్త ప్రాతిపదికంబులకంటెఁ బరంబైన ప్రథమా బహువచన ద్వితీయా బహువచనములకుఁ గ్రమంబుగ లులవర్ణంబు లాదేశములగును. ఉ. రాములు-రాములర్; వనములు-వనములర్. మొ.

౧౨. దీర్ఘపూర్వక లకారోపధ కాదంత సంస్కృత సమమహచ్ఛబ్దములమీఁది లులలకు రురలాదేశంబులగును. ఉ. బాలురు - బాలురర్. మొ.

౧౩. పగతుఁడు మొదలగు వికృతి శబ్దంబుల లులలకును రుర లాదేశంబులగును. ఉ. పగతురు - పగతురర్ - నెయ్యురు- నెయ్యురర్ - అల్లురు - అల్లురర్ - బలియురు - బలియురర్ - ఓ పగతురార. మొ.

౧౪. మహాదమహచ్ఛబ్దంబుల ద్వితీయైక వచనములకుఁ గ్రమంబుగ నినువర్ణకంబులు వైకల్పికంబుగనగును. ఉ. రామునిర్-రామునర్ ; వనమును-వనమునర్. మొ.

౧౫. కర్మప్రవచనీయార్థమందు కూర్చి వర్ణకంబగును. ఉ. వర్షముంగూర్చి జపము. మొ.

౧౬. తృతీయావిభక్తి పరంబగునవుడు మహచ్ఛబ్దంబులకు ఏకవచనంబున వైకల్పికంబుగ ని అను ఆగమంబును, మహాద మహచ్ఛబ్దంబులకు బహువచనంబున నిత్యంబుగ ల అను ఆగమంబును వచ్చును.

౧౭. తృతీయా విభక్తికి చేత - చే వర్ణకంబు లాదేశంబు లగును. ఉ. రామునిచేతన్=రాముచేతన్ - రాములచేత - రాములచేన్ - వనముచేతన్-వనములచేతన్. మొ.

౧౮. సహార్థమందు తృతీయావిభక్తికి తోడ తో వర్ణకంబు లాదేశంబులగును. ఉ. రామునితోడ వచ్చెసీత - రామునితో వచ్చెసీత. మొ.

౧౯. చతుర్థీ విభక్తికి కై-కొఱకు వర్ణకంబు లాదేశము లగును. ఉ. రామునికొఱకున్ - రాములకొఱకున్-రామునికై - రాములకై-వనముకై-వనములకై. మొ.

౨౦. పంచమీ విభక్తికి వలన వర్ణకం బాదేశములగును. ఉ. రామునివలనన్ - రామువలనన్ - రాములవలనన్ ; వనము వలనన్. మొ.

౨౧. గుణము కారణమగుచుండఁగా పంచమీ విభక్తికి పట్టి అనునదియగును. ఉ. జ్ఞానముంబట్టి మోక్షము. మొ.

౨౨. అన్య దూర సమీపాద్యర్థకములు పరంబులగు నపుడు పంచమీవిభక్తికి కంటె వర్ణకంబాదేశంబగును. ఉ. వానికంటె నన్యుండు-దానికంటె దూరము-దీనికంటె సమీపము-రామునికంటె నితరుఁడు. మొ.

౨౩. ఉకార ఋకారాంత శబ్దంబులకంటెఁ బరంబయిన షష్ఠ్యేకవచనంబునకు ను వర్ణకం బాదేశం బగునపుడు నకారంబు పూర్వాగమంబుగా వచ్చును.

౨౪. ఇకారాంతవ్యతిరిక్తశబ్దంబుల షష్ఠీవిభక్తికి కువర్ణకం బాదేశంబగును. ఉ. రామునకుఁ - రాములకుఁ - గురువునకుఁ - విధాతృనకుఁ - అంబకుఁ - రమకుఁ. మొ.

౨౫. ఇకారాంతశబ్దంబులకును - ఏకాక్షర ఈకారాంత శబ్దంబులకును కివర్ణకం బాదేశంబగును. ఉ. హరికిఁ - మతికిఁ - గౌరికిఁ - శ్రీకిఁ - స్త్రీకిఁ. మొ.

౨౬. నీ - మీ అను సర్వనామశబ్దంబులకు కివర్ణకంబు రాదు. ఉ. నీకుఁ - మీకుఁ.

౨౭. నిర్ధారణార్థమందు విధింపఁబడిన షష్ఠీవిభక్తికి లోపల లోవర్ణకంబు లాదేశంబులగును. ఉ. దేవతలలోపల గౌరి యధికురాలు-దేవతలలో రాముఁ డధికుఁడు. మొ.

సౌధంబులోపల నిత్యాదులయందు లోపలననునది అంతర పర్యాయంబగు దేశ్యశబ్దముగాన నది సమానంబని యెఱుఁగవలయు.

౨౮. శేషార్థమందు విధింపఁబడిన షష్ఠీవిభక్తికి యొక్క-వర్ణకం బాదేశంబగును. ఉ. రామునియొక్క గుణములు-రాజుయొక్క పురుషుఁడు. మొ.

౨౯. నిమిత్తాద్యర్థంబులం గలిగిన సప్తమీవిభక్తి ప్రథమాసమముగా నుండును. ఉ. చర్మము నిమిత్తము పులిని జంపెను. మొ.

30. సప్తమీవిభక్తికి అందు వర్ణకంబాదేశం బగును. ఉ. రామునియందుఁ - రామునందుఁ - రాములయందుఁ - వనమునందుఁ. మొ.

31. సమీపవర్తియగు ఇదం శబ్దార్థమునకు అధికరణత్వము వివక్షించునపుడు ప్రకృతి ప్రత్యయ సముదాయంబునకు ఇందు వర్ణకం బాదేశంబగును. ఉ. ఇందు భుజియించె - ఇందు శయనించె. మొ.

32. ఉకారాంతంబులగు కొన్ని అమహచ్ఛబ్దంబులకు సప్తమ్యేకవచనంబున న అను వర్ణకంబు వచ్చును. వనమునఁ - ధనమునఁ - ధనువునఁ. మొ.

---

## అభ్యాసము.

సంబోధనార్థకములయిన యవ్యయము లెవ్వి? అమహత్తు లెవ్వి? మహత్తులెవ్వి? సముద్రుఁడు-మేఘుఁడు-ఉరగులు - ఇవి మహత్తులా? అమహత్తులా? మహత్తులకుఁ బ్రథమైకవచనంబున వచ్చునట్టి వర్ణకమెద్ది? అమహద్ద్వితీయైకవచనవర్ణక మెద్ది? అది నిత్యమా? వికల్పమా? నిత్యమన నేమి? వికల్పమననేమి? బహువచనసూచకములగు వర్ణకములెవ్వి? తృతీయైకవచనమున వచ్చునట్టి యాగమమెద్ది? బహువచనమునకు వచ్చునట్టి యాగమమెద్ది? ఉదాహరణములు కొన్ని చెప్పుము. తోడ-కంటె - పట్టి - లోపల వర్ణంబు లేయేయర్థంబుల వచ్చును?

ఉకార ఋకారాంతములకు నకారాగమం బెప్పుడు వచ్చును? శ్రీకు - గౌరికు అని చెప్పవచ్చునా-కూడదా ! చెప్పవలసినవిధి యేమి? కూడని విధమేమి? నీకి అని యేసూత్రముచే కివర్ణకము వచ్చును? అట్లు చెప్పుట సాధువా? అసాధువా?

---

౩౩. స్త్రీలింగములుగాని అకారాంతములైన అమహచ్ఛబ్దంబుల ప్రథమైకవచనమునకు మువర్ణకం బాదేశంబగును. ఉ. వనము - ధనము - పర్వతము. మొ.

౩౪. ఆ మువర్ణకంబునకు ద్విత్వంబైనను పూర్ణబిందుపూర్వక బువర్ణకంబయినను వచ్చును. ఉ. వనమ్ము - వనంబు. మొ.

౩౫. మువర్ణకాంతములైనశబ్దములకు ప్రథమాబహువచనము మొదలగు విభక్తులు పరంబులగునపుడు మువర్ణం బాగమంబుగా వచ్చును. మువర్ణకమునకు విధించిన ద్విత్వాదులు దీనికిని వచ్చును. ఉ. వనములు-వనమ్ములు-వనంబులు-వనముఁ-వనమ్ముఁ - వనంబుఁ - వనములఁ-వనమ్ములఁ-వనంబులఁ. మొ.

౩౬. కొన్నియెడల అమహచ్ఛబ్దంబుల ఆగమ మువర్ణంబునకు బహువచనంబు పరంబగునపుడు లోపంబును పూర్వమందున్న అకారంబునకు దీర్ఘంబును వచ్చును. ఉ. జొంపాల కూటాలు. మొ.

౩౭. ఇకారాంతశబ్దంబుల సుప్రత్యయంబునకు లోపంబు వచ్చును. ఉ. హరి-వారి-మతి. మొ.

౩౮. వీనికి బహువచనంబు పరంబగునపుడు ఉకారంబు అంతాదేశంబుగానగును. ఉ. హరులు-వారులు-మతులు. మొ.

౩౯. ఇకారము ఉపాంత్యముగా అంత్యముగాఁగలిగిన శబ్దములకు బహువచనంబు పరంబగునపుడు ఉపాంత్యమునకు ఉకారాదేశంబు వచ్చును. ఉ. బలిమి - బలుములు - కలిమి - కలుములు. మొ.

దోసిలి మొదలగుశబ్దంబుల ఉపాంత్య ఇకారమునకును మొదటి ఇకారమునకును గలుగదు. ఉ. దోసిళ్లు - పందిళ్లు - సిళ్లు. మొ.

౪౦. ఇకారాంతమహచ్ఛబ్దంబులకుఁ దృతీయా విభక్తి పరంబగునపుడు న్యాగమంబు లేదు. ఉ. హరిచేతఁ-హరికొఱకుఁ. మొ.

౪౧. ఇకారాంతశబ్దముల సంబోధనప్రథమైకవచనమునకు అడాగమంబులేదు-దీర్ఘంబువైకల్పికంబుగానగును. ఉ. ఓహరి-ఓహరీ-ననుం గృపఁజూడు భారతీ. మొ.

౪౨. ఈకారాంతశబ్దములకు హ్రస్వంబుగలుగఁగా ఇకారాంతంబులకుంబోలెఁ గార్యంబు నెఱుంగవలయు. ఉ. గ్రామణి-గ్రామణులు-నది-నదులు-గౌరి-గౌరులు. మొ.

౪౩. ఉకారాంతశబ్దములకు మూఁడులింగములయందును ప్రథమైకవచనమునకు వువర్ణకం బాదేశంబగును. ఉ. గురువు-ధేనువు-వస్తువు. మొ.

౪౪. ప్రథమాబహువచనము మొదలగు విభక్తులయందు ను ఆయాగమంబు గానవచ్చును. ఉ. గురువులు-గురువుఁ - గురువులఁ - వస్తువుచేతఁ - వస్తువులచేతఁ - ధేనువులతోడఁ. మొ.

౪౫. ఉకారాంత మహచ్ఛబ్దంబులకు వైకల్పికముగా డువర్ణకం బాదేశంబగును. ఉ. గురుఁడు-గురువు. మొ.

౪౬. మను వటావాదిశబ్దంబులకు డువర్ణక నివర్ణకంబులు లేవు. ఉ. మనువు-మనువుఁ-వటువుఁ. మొ.

౪౭. ఉకారాంతశబ్దములకు సంబోధనప్రథమైకవచనమునందు డువర్ణక వువర్ణక ఆదాగమంబులు లేవనియును ప్లుతము వచ్చుననియును కొందఱు చెప్పుదురు. ఉ. ఓగురూ-ఓశంభూ. మొ. జరత్కారూ మునిశ్రేష్ఠ యను భారతప్రయోగమువలనఁ బ్రాతిపదికాంత ఉకారమునకే ప్లుతంబు - లోపవిధి బలీయము గనుక సు లోపంబు.

౪౮. ఓకారాంతంబయిన గోశబ్దంబునకు 'గోవు' అని రూపంబు.

౪౯. నామంబుల తుదనుండుదీర్ఘంబునకు హ్రస్వంబు గలుగును. ఉ. అంబ-గౌరి-వధువు. మొ.

౫౦. దేశ్యపదంబుల దీర్ఘంబులకు హ్రస్వంబు గలుగదు. ఉ. నవలా-నేజా-లకోరీ. మొ. కొన్నియెడల లకోరీ శబ్దంబునకు హ్రస్వంబు గానఁబడియెడి. ఉ. లకోరీ-లకోరులు.

౫౧. ఏకాక్షరసంస్కృతశబ్దంబుల దీర్ఘంబునకు హ్రస్వంబు గలుగదు. ఉ. శ్రీ-హ్రీ-జ్యా-మా. మొ.

౫౨. దీర్ఘసమాసములయందు వైకల్పికంబుగ ఈకారంబునకు హ్రస్వంబు గలుగును. ఉ. నదిసుతగురుకర్ణశల్యనాగపురీశుల్.

౫౩. వృథాయను అవ్యయంబు దీర్ఘంబునకు హ్రస్వంబు వైకల్పికంబు. ఉ. వృథచేసితివి-వృథా శపియింతురే.

౫౪. ఋకారాంతములు అవిధాత్రాదులు - విధాత్రాదులు అని రెండు విధములు గలవి.

౫౫. అవిధాత్రాదుల అంత్యాచ్చునకు అకారం బాదేశంబుగా వచ్చును. ఉ. పిత-మాత-స్వస. మొ.

౫౬. విధాత్రాదిగణంబునకు వైకల్పికముగా డువర్ణకం బాదేశంబగును. ఉ. విధాత-విధాతృఁడు-సవిత-సవితృఁడు – నేత – నేతృఁడు. మొ. ఈరెండును క్రమముగా రమాశబ్దముతోడను ఈశబ్దముతోడను దుల్యంబులు.

౫౭. కొన్నియెడల అమహచ్ఛబ్దంబులకును ఏకాదిగణంబునకును బిందుపూర్వక డువర్ణకం బాదేశంబగును. ఆదేశంబగునపుడు ఉకారంబు గలుగదు. ఉ. కత్తెరఁడు - కైరఁడు-పులియుఁడు-వనమొక్కఁడు. ఇత్యాదు లమహత్తులు. ఒక్కఁడు-అతఁడు-ఇతఁడు- ఎవ్వఁడు – మనుమఁడు – గండఁడు - మిండఁడు.

ఇత్యాదు లేకాదులు. ఆ యేకాదిగణములలో నొక్కఁడను దానికి నొక్కఁడనియును రూపంబు గలదు.

౫౮. అసమాసమందు సురశబ్దంబునకు స్త్రీత్వబహుత్వంబు లగును. ఉ. సురలు. సమాసమందు భూసురుఁడు.

౫౯. అసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబు. ఉ. అసుర-అసురుఁడు.

౬౦. కుశాదిశబ్దంబుల మువర్ణకంబునకు లోపంబు నిత్యంబు. ఉ. కుశ-దర్భ. మొ.

౬౧. దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబు. ఉ. దూత-దూతుఁడు-యోధ-యోధుఁడు-శుంఠ-శుంఠుఁడు.

౬౨. చరిత-భ్రమ-హంస-అభిలాష-తరంగ ఇత్యాదులకు ముఁవర్ణకంబు వైకల్పికంబు. చరిత-చరితము. మొ.

౬౩. మీసము-చుట్టము వీనికి బహువచనంబు పరంబగు నపుడు మువర్ణలోపంబు వైకల్పికంబు. ఉ. మీసలు - మీసములు-చుట్టలు-చుట్టములు.

౬౪. రైశబ్దమునకు 'రో' యనియు-నౌశబ్దమునకు 'నావ' అనియు రూపంబులు. ఉ. రోయీవి-రోపడఁతి-నావఁ జూచెఁ-నావ నడచెఁ.

౬౫. గ్లౌశబ్దము స్త్రీసమము. ఉ. గ్లౌయుదయించెఁ. కంధరాశబ్దము నపుంసకసమము. ఉ. కంధరము.

౭౭. భూ శబ్దమునకు భువి - దివ్ శబ్దమునకు దివి అని రూపంబులు. ఉ. భువి దివి నీవలనఁబొడమెం బురుషవతంసా.

౭౨. ఐకారమునకు అయి యనియు-ఔకారమునకు అవు అనియు ఆదేశంబులు వైకల్పికముగా నగును. ఉ. చెలువై-చెలువయి-ఔర-అవుర. మొ.

౭౮. ద్వంద్వసమాసమందుఁ బూర్వపదమందున్న ఋకారంబునకు రేఫాదేశంబు వైకల్పికంబు. ఉ. మాత్రపితృబుద్ధి నంభోధిపుత్రిఁగొలుతు-మాతాపితృబుద్ధి సీత మదిలోఁదలతుఁ.

౭౯. ఆంధ్రమం దొకానొకచోట గకారంబునకు వకారం బాదేశంబగును. ఉ. ప్రోగు - ప్రోవు - ఈగి - ఈవి - తోగ - తోవ. మొ.

రేఁగు - బాగు - వాఁగు ఇత్యాదులయందుఁ గలుగదు.

౮౦. కొన్నియెడల నువర్ణాంత శబ్దములకు ఏకవచనంబునందు వికల్పముగాను బహువచనంబునందు నిత్యముగాను నువర్ణంబునకు బిందుపూర్వక కువర్ణం బాదేశం బగును. ఉ. కొలను-కొలఁకు-కొలఁకులు - వలను-వలఁకు - వలఁకులు-కెలను కెలఁకు-కెలఁకులు-మ్రాను-మ్రాఁకు-మ్రాఁకులు. మొ.

౮౧. మఱి కొన్ని నువర్ణాంత శబ్దములకు అట్లె అర్ధబిందుపూర్వక గువర్ణకం బాదేశంబగును. ఉ. రేను-రేఁగు-రేఁగులు-గోను-గోఁగు-గోఁగులు. మొ.

౨౨. కొన్నియెడల బహువచనంబు పరంబగునపుడు నువర్ణమునకు లోపంబువచ్చును. ఉ. చేను-చేలు - మీను - మీలు- పేను-పేలు.

మేను-కౌను-వీను ఇత్యాదులయందు రాదు.

౨౩. ద్విత్వముతోఁగూడిన లువర్ణంబునకు లులలు పరములగునపుడు వైకల్పికముగా పూర్ణబిందు పూర్వక డువర్ణం బాదేశంబగును. ఉ. విల్లు - విండులు-ముల్లు – ముండులు – విల్లులఁ - విండులఁ. మొ.

౨౪. ఆ డువర్ణ సంబంధియైన ఉకారమునకు లోపంబు వైకల్పికముగానగును. ఉ. విండ్లు-విండ్లఁ-ముండ్లు-ముండ్లఁ. మొ.

౨౫. ఆలు మొదలగు శబ్దంబుల లువర్ణంబునకు లులలు పరంబులగునపుడు పూర్ణబిందు పూర్వక డువర్ణంబును-దాని ఉకారంబునకు లోపంబును-ఆ లులలకు రురలును ఆదేశంబులగును. ఉ. ఆలు-ఆండ్రు-ఆండ్రఁ - జవరాలు-జవరాండ్రు - జవరాండ్రఁ- కోడలు-కోడండ్రు-కోడండ్రఁ. మొ.

౨౬. ఏఱు-గోరు ఇత్యాది శబ్దములయందున్న ఉకారమునకు లోపంబు రాఁగా అలఘు లకారం బాదేశంబగును. ఉ. ఏళ్లు-గోళ్లు. మొ.

౨౭. డలట వీని ఉకారఇకారములకు లులలు పరంబు లగునపుడు లోపము వైకల్పికము. ఉ. త్రాడు - త్రాళ్లు-త్రాడులు-

తడి-తళ్లు-తడులు-చాలు-చాళ్లు - చాలులు-అంబలి - అంబళ్లు-అంబలులు-చెట్టు-చెట్లు-చెట్టులు-జెట్టి-జెట్లు-జెట్టులు. మొ.

౭౮. ద్విత్వముతోఁగూడిన ళువర్ణముయొక్క ద్విత్వమునకును ఉకారమునకును లోపంబు వైకల్పికంబు. అంజళ్గాఁచి - వందిళ్వేసి. మొ.

౭౯. ఔపవిభక్తిక యోగ్యమైన లివర్ణమునకు లులవర్ణకంబులు పరంబులగునపుడు ఇకారమునకు లోపంబును-పూర్ణబిందుపూర్వక డువర్ణంబును బహుళముగా వచ్చును. ఉ. రోఁకలి-రోఁకండ్లు - అటకలి - అటకండ్లు - గొడ్డలి - గొడ్డండ్లు. మొ.

౮౦. నామంబులకడపట మున్ను సంయుక్తంబయి ముగిసినదయినను ఉవర్ణకంబు మరలఁ గానంబడుచున్నది. ఉ. మొనళ్లులు-నెమళ్లులు-ముండ్లులు. మొ.

౮౧. ఉకారాంతములగు కొన్నిశబ్దంబులకు న అను సప్తమీవిభక్తి పరంబగునపుడు నామాంతమందున్న ఉకారంబునకు విభక్త్యాదియందున్న నకారంబునకు లోపంబగు. ఉ. చోటున - చోటఁ - ఇట్లు మీఁదఁ - క్రిందఁ. మొ.

కొంగున-పేఁవున - వైపున ఇత్యాదులయందుఁ గలుగదు.

౮౨. ఔపవిభక్తికాంతంబులగు నామంబులకు సప్తమ్యర్థతృతీయార్థములయందు అత్వంబు వచ్చును. ఉ. పంటఁ - మింటఁ - చేతఁ - వాతఁ. మొ.

౮౩. ఉకారాంతవ్యతిరిక్తంబులును సంస్కృతప్రాకృతసమంబులునగు స్త్రీలింగశబ్దంబులకును - స్త్రీసమంబులయిన సమస్తదేశ్యశబ్దంబులకును సులోపంబు గలుగును. ఉ. అంబ-రమ-గౌరి-వాణి-జెడ-మేర - రాణి - సిరి-జాడ - మేడ-తావి - మోవి-ఊరు- తేరు-మోవు-దావు. మొ.

౮౪. ఇయ అంతమందుఁగల శబ్దంబులయొక్క ఇయ అను దానికి ఎకారాదేశంబును-ఇకారమునకు లోపంబును వైకల్పికముగానగును. ఉ. విడియము-విడెము-విద్యము. ముత్తియము-ముత్తెము-ముత్యము. కన్నియ-కన్నె-కన్య. మొ.

౮౫. దేశ్యశబ్దములన్నియుఁ దఱచుగా స్త్రీలింగసమంబులును నపుంసకలింగసమంబులునుగా నుండును. ఉ. అన్న-చిన్న-బియ్యము-వియ్యము. మొ. తఱుచుగ ననుటచే అల్లుఁడు. మొ.

౮౬. స్త్రీసమంబులగు దేశ్యశబ్దంబులు తత్సమస్త్రీలింగసమములుగా నుండును. ఉ. జాడ - మేడ - తావి - మోవి - మోవు-దావు. మొ. నపుంసక సమములగు దేశ్యశబ్దంబులు నపుంసక తత్సమ శబ్దంబులవలె మువర్ణాంతములుగా నుండును. ఉ. జొంపము-అంపము-పల్లము-బెల్లము. మొ.

౮౭. తత్సమశబ్దంబులు తఱుచుగా ప్రకృతితోడ సమానమయిన లింగము గలవిగానుండును. ఉ. రాముఁడు-సీత - రఘుకులము-జముఁడు-జడ-కారము. మొ.

౮౮. వర్ణనిర్దేశమందును ప్రత్యయమందును వర్ణమునకు దీర్ఘంబువచ్చును. ఉ. కాకు-మూకు-నూవచ్చును-మూవచ్చును.

౮౯. వడ్లు-సిల్లు. ఇత్యాదులు నిత్యబహువచనాంతములు. వెండి-బంగారు ఇత్యాదులు నిత్యైకవచనాంతములు.

౯౦. అదంతగుణవాచకంబులకంటెఁ బరంబుగ నివర్ణకంబు బహుళంబుగానగును. ఉ. నల్లని కలువ - నల్లగలువ. తెల్లని తమ్మి-తెల్లదమ్మి. బహుళమన్నందువలన చక్కనివాఁడు. ఇత్యాదులందు నివర్ణంబు నిత్యంబు. అదంత మన్నందున వెలిదమ్మి. ఇత్యాదులయందు నివర్ణంబులేదు.

౯౧. నిందయందు శబ్దాదినుండి వర్ణంబునకు గివర్ణం బాదేశంబగును. హరి-గిరి-వని-గిని. మొ. దీర్ఘంబునకు దీర్ఘంబగు. ఉ. రాముఁడు-గీముఁడు. మొ.

శాస్త్రనియమంబు లేక ప్రయోగశరణంబులై గ్రంథంబుల ననేక శబ్దంబులు గానంబడుచున్నవి. ఉ. నిగనిగలు - నిగన్నిగలు - నిగనిగమనెను - తళతళమనెను - జుంజుమ్మనెను - వికవిక నవ్వెను - హూహూయని యగ్నినూఁదెను-గునగున నడచెను-నట్టనడుమ-కొట్టకొన-చిట్టచివర - పట్టపగలు-ఎట్టయెదురు - మిట్టమిఱ్ఱు-క్రొన్నన - క్రొంజివురు- నెన్నడుము-నెత్తావి. చెంగలువ-చెంగావి - పొందామర - ప్రాఁజదువులు - వేవేలు - వేనవేలు - రాయంచ-ఇందనుక-పేరురము - మోనల నోనాడెను - మఱాళ-చానేసెను-దీలుపడె - నేతురు - పోషింతె-మంతె-వలిమిరి - చలిమిరి-కల్లరి-జూదరి-కన్నెటికము-రెడ్డటికము. మొ.

౯౩. నెగసె - పొనరె - పొందె. ఇత్యాదులయం దాఁడి హల్లునకు లోపంబు వైకల్పికంబు. ఉ. ఎగసె-ఒనరె-ఒందె.

---

## అభ్యాసము.

దీర్ఘాంతములగు సంస్కృతశబ్దంబులకుఁ దెనుఁగున నెట్లు ప్రయోగము? ఉదాహరణములెవ్వి? ఋకారాంతము లెట్లు ప్రయోగింపనగును? ఉకారాంతములకు వచ్చునట్టి వర్ణకము లెవ్వి? మనుఁడని ప్రయోగింపవచ్చునా? వృద్ధు - చార్వాకు- మూర్ఖు ఇవి సాధువులా? వేఱు రూపములున్నఁ జెప్పుము. దర్భము-కుశము-అని చెప్పవచ్చునా? చేనులు-గోనులు-రేనులు-ఇవి సరియైన రూపములా? కానియెడల దిద్దుము. సూత్రము చెప్పుము. వనశబ్దమునకుఁ దృతీయావిభక్తి చెప్పుము. ములికి-బుడిపి-కలికి-వీనికి బహువచనరూపము లెవ్వి? దోసిలి - అటకలి-గొడ్డలి-వీనికి బహువచనములు చెప్పుము.

## తప్పులు దిద్దుము.

హరినిచేతన్-వటునిన్-వటుఁడు - రమాయొక్క - రాములో వలన్-రాముయందు - గోలు మందనుండి వచ్చినవి-దోసిలిలు-కుశము-పిత్రుడు - మాతృ - అయిశ్వర్యము - హరిలకొఱకున్-రామునన్-వద్దులు.

అజంతపరిచ్ఛేదము సంపూర్ణము.

---

## హలంతపరిచ్ఛేదము.



౧. హలంతశబ్దములు. అగుణవర్ధనములు-గుణవర్ధనములు అని రెండువిధములు గలవి.

౨. అగుణవర్ధనములు సంస్కృతప్రథమైకవచనతుల్యములు. ఉ. కకుప్-దిక్-దృక్. మొ.

3. గుణవర్ధనములు సంస్కృతద్వితీయైక వచనతుల్యములు. ఉ. గుణవంతమ్-సుహృదమ్-వేదవిదమ్. మొ.

౪. హ్రస్వంబుకంటెఁ బరంబులయిన అగుణవర్ధనంబుల కడహల్లులకెల్ల ద్విత్వోత్వంబులు వచ్చును - సుప్రత్యయము లోపించును. ఉ. కకుప్పు-దిక్కు-దృక్కు. మొ. దీర్ఘంబుకంటెఁ బరంబులయిన హల్లులకు ద్విత్వంబు వైకల్పికంబు-ఉత్వంబు-నిత్యంబు. ఉ. వాకు-వాక్కు. మొ.

౫. గుణవర్ధనంబులయొక్క అంత్యహల్లునకు లోపంబు గలుగును.

౬. వానికి మహత్తులకు డువర్ణకంబును అమహత్తులకు మువర్ణకంబును మునుపటివలెనగును. ఉ. గుణవంతుఁడు-సుహృదుఁడు-అనడ్వాహము - శ్వానము. మొ. మఱికొన్ని హలంత శబ్దముల యంత్యహల్లునకు వికల్పముగా లోపంబు గలుగును. ఉ. జగము-జగత్తు.

౭. ఆత్మన్ శబ్దమునకు ఆత్మ-ఆత్ముఁడు-ఆత్మము అని మూఁడు రూపంబులు.

౮. ఇమనిచ్ ప్రత్యయాంతములకు గరిమ-గరిమము అని ఇట్లు రెండు రూపంబులు.

౯. రాజన్ శబ్దమునకు రాజు అనిరూపము.

౧౦. పథిన్, బుభుక్షిన్ శబ్దములకు పథము బుభుక్షుఁడు అని రూపంబులు.

౧౧. సుశర్మాదులకు రూపద్వయంబు. ఉ. సుశర్మ-సుశర్ముఁడు-నిగమశర్మ-నిగమశర్ముఁడు. మొ.

౧౨. హనుమచ్ఛబ్దమునకు హనుమంతుఁడు-హనుమానుఁడనియు-భగవచ్ఛబ్దమునకు భగవంతుఁడు - భగవానుఁడనియు రూపంబులు.

౧౩. సకారాంతశబ్దములందుఁ గొన్నిటికి అంత్య సకార లోపంబు గలుగును. ఉ. తేజము - తేజస్సు-వక్షము - వక్షస్సు. మొ. కొన్నిటికి గలుగదు. ఉ. వయస్సు-వయస్సు. మొ.

౧౪. నకారాంత శబ్దములందుఁ గొన్నిటికి ద్విత్వలోపం బునగును. ఉ. మనము - మనస్సు - మనసు - శిరము - శిరస్సు - శిరసు. మొ.

౧౫. సంపచ్ఛబ్దమునకు సంపద - సంపత్తు-ఆపచ్ఛబ్దమునకు ఆపద-ఆపత్తు అనిరూపములు.

౧౬. విశేషణంబులకు విశేష్యంబులకుంబోలె లింగ ప్రయుక్తరూపంబు లగు. ఉ. సమస్తునిరాజుఁడు రాముఁడు - సమస్తునిరాజసీత-బహురాజము దేశము.

౧౭. తదాద్యర్థకములైన - ఆ - ఈ-ఏ-లకు మహదర్థంబున ప్రథమైకవచనంబున వాఁడు-వీఁడు - ఎవఁడు అనియును ; బహువచనంబున వారు - వారలు - వాండ్రు-వీరు-వీరలు - వీండ్రు-ఎవరు - ఎవ్వరు - ఎవండ్రు-ఎవ్వండ్రు అనియును ; ద్వితీయైకవచనంబున వానిఁ-వీనిఁ-ఎవనిఁ అనియును ; బహువచనంబున వారిఁ-వీరిఁ-ఎవరిఁ అనియును ; మహత్యర్థంబునఁ బ్రథమైక వచనంబున ఆమె-ఈమె - ఏమె అనియును ; అమహదర్థంబునఁ బ్రథమైకవచనబహువచనంబుల అది - అవి - ఇది - ఇవి - ఎది-ఎవి అనియు రూపంబు లెఱుంగునది.

౧౮. అస్మచ్ఛబ్దదేశ్యము నా. దీని ప్రథమైకవచనములు నేను-ఏను. బహువచనములు మేము-ఏము. ద్వితీయైకవచనములు నన్నుఁ-ననుఁ. బహువచనములు మమ్ముఁ-మముఁ. నాచేతఁ-మాచేతఁ ఇత్యాదు లూహ్యంబులు.

౧౯. యుష్మచ్ఛబ్దదేశ్యము నీ. దీని ప్రథమైకవచనములు నీవు-ఈవు. బహువచనములు మీరు - ఈరు. ద్వితీయైకవచనములు నిన్నుఁ-నినుఁ. బహువచనములు మిమ్ముఁ-మిముఁ. నీచేఁ-మీచేతఁ. ఇత్యాదు లూహ్యంబులు.

౨౦. ఆత్మార్థక శబ్దదేశ్యము తా. దీని ప్రథమైకవచనము తాను. బహువచనములు తారు-తాము-తమరు. ద్వితీయైక వచనములు. తన్నుఁ - తనుఁ. బహువచనములు తమ్ముఁ-తముఁ -తనచేతఁ-తమచేతఁ ఇత్యాదు లూహ్యంబులు.

౨౧. ఉభయార్థకము మన. దీని ప్రథమాబహువచనము మనము. ద్వితీయాబహువచనము మనలఁ-మనచేతఁ - మనతో డఁ ఇత్యాదు లూహ్యంబులు.

౨౨. ఇదమ్-అదస్-ఏతత్ - శబ్దంబుల దేశ్యంబు ఈ. యచ్ఛబ్ద దేశ్యము ఏ. తచ్ఛబ్దదేశ్యము ఆ. ఇవి మఱియొక శబ్దముతో నన్వయించునపుడు తాము హ్రస్వమును బొంది మీఁదివర్ణమునకు వైకల్పికముగా ద్విత్వమును బుట్టించును. ఉ. ఈదేశము-ఇద్దేశము-ఏదేశము - ఎద్దేశము-ఆదేశము-అద్దే శము.

౨౩. కొన్నియెడల శబ్దాంతరాన్వయము లేనప్పుడును ద్విత్వ ము కలుగును. ఉ. ఇది-ఇద్ది-ఎది-ఎద్ది-అది-అద్ది. సంయుక్తంబు పరంబగునపుడు కలుగదు. అత్రోవ - అప్రోలు - అస్వర్గము.

౨౪. శ - ష - స - హ - ర - ఇవి పరములగునపుడు పైవిధి చెల్లదు. ఉ. ఆశంకరుఁడు - ఆషణ్ముఖుఁడు - ఆసేన-ఆహాయము- ఆరాజు.

౨౫. ఇకారాంతంబులయిన దేశ్యాస్మద్యుష్మచ్ఛబ్ద విశేషణ ముల ఏకవచమునందుఁ గ్రమముగా సి-వి అను వర్ణకములు

వచ్చును. ఉ. నేను కవిని - నీవు కవివి - నేను తండ్రిని - నీవు తల్లివి. మొ.

౨౬. ఇకారాంత వ్యతిరిక్తములయిన అస్మచ్ఛబ్ద విశేషణముల యేకవచనమందు నువర్ణకంబును యుష్మచ్ఛబ్ద విశేషణముల యేకవచనమందు వువర్ణకంబును వచ్చును. ఉ. నేను భక్తుఁడను - నీవు దేవుఁడవు. మొ.

౨౭. అస్మచ్ఛబ్ద విశేషణముల బహువచనమందు మువర్ణకంబును యుష్మచ్ఛబ్ద విశేషణముల బహువచనమందు రువర్ణకంబును వచ్చును. ఉ. మేము భక్తులము-మీరు పూజ్యులరు. మొ.

౨౮. ఉకారాంతశబ్దములకు ను - ము - వు - రు వర్ణకములు పరములగునపుడు అకారాదేశంబు వచ్చును.

౨౯. పైవిధి క్రియాపదంబులయందును చెల్లును. ఉ. నేను జయించుచున్నాఁడను-నీవు జయించుచున్నాఁడవు. మొ.

30. సమస్తశబ్దంబులమీఁద సంబంధార్థమందు దివర్ణకంబు వచ్చును. ఉ. రాజుది - వానిది-నీది - నాది - తనది. మొ.

3౧. నీ - నా - తా - అనువానిమీఁద సమానంబున దువర్ణంబు వికల్పంబుగ వచ్చును. ఉ. నాదుసొమ్ము - నీదుకీర్తి-తనదుమహిమ. మొ.

3౨. తెనుఁగునందుఁ గొన్నియెడల క్రియాపద నామపదములయొక్క ఉకారంబునకు లోపంబు గలుగును. ఉ. చూడ

ర్జనులు-వత్సుస్సనులు - కఁదెఱచి-కల్దాోవి - విల్పాని-పేర్వాడి-గోర్మోసి. మొ.

33. సమస్తములయిన స్త్రీలింగశబ్దములకు - టాప్ - జీప్ - మొదలయిన స్త్రీప్రత్యయములు నియతములు. ఉ. సీత భర్తృవత్సల-రామకృప సంతాపహారిణీ-లక్ష్మి సర్వాభీష్టప్రదాత్రి. మొ.

3౪. తెనుఁగునందును స్త్రీలింగవిశేషణములు స్త్రీలింగములు గలవిగానే యుండును. ఉ. పాలమున్నీటికూఁతురు పద్మహస్త - పుడమిచెలికూఁతురే సర్వభువనజనని. మొ.

3౫. అప్రాణివాచక స్త్రీలింగ విశేషణము స్త్రీలింగముగలదియు లేనిదియు నగును. ఉ. శరచ్చంద్రిక మనోహర - మనోహరము. మొ.

3౬. అ-ఇ-ఉ-అను వర్ణకములు తెనుఁగున స్త్రీలింగద్యోతకములు. గౌర-గౌరి-గౌరు-లచ్చ-లచ్చి-లచ్చు. మొ.

3౭. త్వ ప్రత్యయార్థమందు తన వర్ణకంబు వచ్చును. ఉ. పెద్దతనము-పిన్నతనము-దొరతనము. మొ.

3౮. ప్రాతిపదికంబుమీఁద స్వార్థమందు కవర్ణకంబు వచ్చును. ఆకవర్ణకంబు పరంబగునపుడు ఉకారాదేశంబు వచ్చును. ఉ. వెలఁది-వెలఁదుక-పొలఁతి-పొలఁతుక. మొ.

3౯. గుణవాచకంబులగు నల్లాదులకు నవర్ణకంబగు. ఉ. నల్లన-ఎఱ్ఱన-తెల్లన - పచ్చన - చామన - తియ్యన - పుల్లన - చక్కన. మొ.

౪౦. మత్త్వర్థమందు పుంవాచకములకు కాఁడు ప్రత్యయంబును- స్త్రీవాచకములకు కత్తె ప్రత్యయంబును వచ్చును. ఉ. చెలికాఁడు-చెలికత్తె-వన్నెకాఁడు-వన్నెకత్తె. మొ. చెలిమికలవాఁడు-చెలిమికలది-వన్నెకలవాఁడు-వన్నెకలది అని యర్థము.

౪౧. చిన్నాదులకు ఆరికవర్ణకము వచ్చును. ఉ. చిన్నఆరికము-పెద్దఆరికము. మొ.

౪౨. దఘ్నార్థంబునందు బంటికోలఁదులగు. ఉ. మోఁకాలిబంటి-మోఁకాలికోలఁది.

౪౩. స్త్రీవాచకంబులగుచో వగాదులకు ఆఁడివర్ణకంబువచ్చును. ఉ. వగలాఁడి-చిన్నెలాఁడి. మొ.

౪౪. సంస్కృతమందే యే యర్థంబులయందే యే విభక్తి వచ్చునో, తెనుఁగునందు ఆయా యర్థంబులయందు దాయా విభక్తి వచ్చును.

| | |
|---|---|
| సీత సర్వోత్తమురాలు - | ప్రాతిపదికార్థమునఁ బ్రథమ. |
| సీతను దలఁచెద- | కర్మార్థమున ద్వితీయ. |
| సురలచేత నుతింపఁబడియె - | కర్త్రర్థమునఁ దృతీయ. |
| ఖడ్గముచేత నఱకె- | కరణార్థమునఁ దృతీయ. |
| దయచేత రక్షించె- | హేత్వర్థమునఁ దృతీయ. |
| నాకొఱకిచ్చె- | సంప్రదానమునఁ జతుర్థి. |
| పాపమువలనఁ బాసె- | అపాదానార్థమునఁ బంచమి. |
| నీవలనఁ బ్రదికితి- | హేత్వర్థమునఁ బంచమి. |

రాముని దాసుఁడు-   సంబంధార్థమున షష్ఠి.
జగములకుఁ గర్త-   కర్త్రార్థమున షష్ఠి.
వైకుంఠమందుండె-   అధికరణంబున సప్తమి.

౪౫. తెనుఁగునందుఁ గొన్నియెడల నొక విభక్త్యర్థమందు మఱియొక విభక్తి వచ్చును. ఉ. సీత నాకు వర మిచ్చె-ఇచటఁ జతుర్థ్యర్థంబున షష్ఠి-శిరమున గురుపాదుకల వహించితి-ఇచటఁ దృతీయార్థమందు సప్తమి-సుఖముండె-ఇక్కడఁ దృతీయార్థమందుఁ బ్రథమ.

౪౬. అచేతనవాచకములగు శబ్దములకుఁ దృతీయాసప్తమ్యర్థములయందు ద్వితీయయు-ద్వితీయార్థమందుఁ బ్రథమయు వైకల్పికముగా నగును. ఉ. కత్తిని గొమ్మను నఱికెను-కత్తిచేఁ గొమ్మను నఱికెను. ద్వారకనున్న వాఁడు - ద్వారకయందున్న వాఁడు. రథమెక్కె-రథమునెక్కె. మొ.

౪౭. ఉండిశబ్దము పరంబగునపుడు పూర్వశబ్దమునకు ద్వితీయాసప్తములగును. ఉ. వనమునుండి - వనమందుండి - బ్రహ్మలోకముననుండి. మొ.

౪౮. షష్ఠ్యంతవిశేషణమునకుఁ బ్రథమ వచ్చును. ఉ. అనఘచరితుఁడు రఘునందనునకుఁ బ్రణతి. మొ.

౪౯. విశేషణ విశేష్యంబు లితర శబ్దములచేత వ్యవధానము గలవియు నగును. ఉ. రాముఁడలఁచెద సుగుణాభిరాము నెపుడు.-రామునభిరాము సద్గుణధాముఁ దలఁతు. మొ.

౫౦. తెనుఁగునందు విశేషణ గతములయిన బహువచనములకు ఏకవచనము వచ్చును. ఉ. ఇంపయిన పలుకులు-సొంపయిన సిరులు-ఇష్టమగు పదార్థములు. మొ.

౫౧. తెనుఁగునందును ద్విగుసమాసము-కర్మధారయసమాసము-తత్పురుష సమాసము-ద్వంద్వసమాసము - బహువ్రీహిసమాసము-ఉపమాన సమాసము-ఉత్తరపద లోపసమాసము-రూపకసమాసము మొదలగు సమాసములు కలవు.

ముచ్చిచ్చు-మువ్వన్నె-ముక్కాక. మొ. ద్విగువు.
నల్లగలువ-తెల్లదమ్మి. మొ. కర్మధారయము.
మల్లెపువ్వు-దొంగయలుకు. మొ. తత్పురుషము.
తల్లిదండ్రులు-అన్నదమ్ములు. మొ. ద్వంద్వము.
అలరువిల్తుఁడు-నలువ. మొ. బహువ్రీహి.
చిగురుఁగేలు-జుంటిమోవి. మొ. ఉపమానపూర్వపదము.
కేలుదమ్మి-రాచసింగము. మొ. ఉపమానోత్తరపదము.
జవ్వాజిసెట్టి-వంటలరంగమ్మ. మొ. ఉత్తరపదలోపము.
కన్నుగలువ-కౌనుమిన్ను. మొ. రూపకము.

౫౨. సమాసాంత ప్రత్యయవిధులు ఔపవిభక్తికములవలెఁ జేయఁదగినవి. ఉ. అలరువిల్తుఁడు-వాలుగంటి - తమ్మిచూలి - నలువ. మొ.

౫౩. కేవలాంధ్రపదములతోఁగూడిన సమాసమును సమాసకమందురు. ఉ. నిండుపున్నమనాఁటిజాబిల్లి వెన్నెల తేటతియ్యని క్రొమ్మావి తోఁట సీటు. మొ.

౧౪. సమాసశావయవములయిన శబ్దములయందు విభక్తి మొదలయినవానికి లోపము వచ్చును. ఉ. వేల్పుదొర - రాచకొమరుఁడు. మొ. మొదలగు అని యన్నందువలన తమ్మికంటి ఇత్యాదులయం దుపమావాచకలోపంబును-వేల్పులచెట్టు-మావులతోఁట ఇత్యాదులయందు యొక్కకుమాత్రము లోపంబును గ్రహింపఁబడును.

౧౫. సంస్కృతాంధ్రపదములతోఁడఁ గూడిన సమాసంబు మిశ్రసమాసంబు. ఉ. పద్మాకరపుఁ దావిచెలువు - పాలకడలిపట్టి రామణీయకము. మొ.

౧౬. ఆఱక్షరములవఱకును తెనుఁగుపదము సంస్కృతపదముతో సమసించి కర్మధారయ మగును. ఉ. వాఁడి మయూఖములు-వేఁడి పయోధారలు-కలికి భుజంగ కన్యలు. మొ.

౧౭. అనేకములయిన సంస్కృత శబ్దములు తెనుఁగు శబ్దములతోడను - తెనుఁగుశబ్దములు సంస్కృత శబ్దములతోడను యథేచ్ఛముగాఁ దమ తమవిభక్తివికారములతో సమసించుచున్నవి. ఉ. తెలిదమ్మి కంటిగేహిని పుట్టినింటి సంపత్తి పెంపు - కలువకంటి కటాక్షంపు గుంపులుఁ మొః

---

అభ్యాసము.

హలంతములననేమి? అవి యెన్ని విధములు? గుణవర్గణ శబ్దములను కొన్నిటిఁ జెప్పుము. అగుణవర్గణశబ్దములను కొన్ని

చెప్పుము. కకుప్ - దిక్ - వాక్ - రాట్ - సుహృదమ్-అనడ్వా హమ్-వీనికిఁ దెలుఁగున నగురూపంబు లెవ్వి? ఇమనిచ్ ప్రత్య యాంతములకుఁ గొన్ని యుదాహరణములు వక్కాణింపుము. వర్షిణ-ఋభుక్షిణ-అప్-వీనికిఁ దెలుఁగు రూపములు చెప్పుము. వాఁడు-వీఁడు-ఎవఁడు-వీనికి స్త్రీలింగరూపము లెవ్వి? ఆ తావి- ఈ దేశము - ఏ అమరులు - ఆ పట్టణము అని యుండునపుడు సమసనరూపము లెట్లుండును? నేను భక్తుఁడను - అనునపుడు రూప మెట్లు వచ్చునో సూత్రములు చెప్పి రూపింపుము. అప్రోలు-అస్వర్గము - అఋషి - అనురూపంబులు సాధువులా? తెనుఁగున స్త్రీప్రత్యయములెవ్వి? తద్ధితాంతము లెవ్వి? కారక ము లెవ్వి? సమాసము లెన్నివిధములు? ముచ్చిచ్చు - తెల్ల గుఱ్ఱము-చెట్టుకొమ్మ-కలువకంటి-ఈ సమాసములకుఁ బేళ్లెవ్వి?

హలంతపరిచ్ఛేదము సంపూర్ణము.

---

## క్రియాపరిచ్ఛేదము.

౧. ఉపకృతి-పరిణతి-సంవృతి అని తత్సమక్రియలు మూఁడు విధములు గలవి.

౨. పుష్-ణు మొదలైనవి ఉపకృతి క్రియలు. భూ-జి మొదలైనవి పరిణతి క్రియలు. రంజి-వసి మొదలైనవి సంవృతి క్రియలు.

౩. ఉపకృతిక్రియ ఘుజ్-క్తి మొదలైన కృత్ప్రత్యయము లంతమందుఁ గలదియై ప్రకృతియగును. ఉ. పోష - నుతి - స్తుతి. మొ.

౪. పరిణతిక్రియ అయ్-అవ్-అర్ 'అనువానితోఁ గూడి ప్రకృతియగును. ఉ. జయ్-క్షయ్-సంశ్రయ్ - అనుభవ్ - పరిభవ్ - అపహ్నవ్ - భర్ - వర్ - హార్. మొ.

౫. సంవృతిక్రియ ఉపదేశకాలమందు సిద్ధమైన స్వరూపముతోడఁ గూడి ప్రకృతియగును. ఉ. రంజ-వస-అర్థ - గర్వ - గణ-దండ-భజ. మొ.

ఈమూఁడువిధములైనక్రియలకు భేద మెట్లుఁగవలయును?

౬. తద్ధర్మ వర్తమానభూత భవిష్య దర్థకములని క్రియలు నాల్గువిధములు గలవియగును.

తద్ధర్మమనఁగా భూతాద్యర్థత్రయ విలక్షణమైన కొండొక యర్థవిశేషము.

౭. మూఁడు విధములైన క్రియాపదములకును స్వార్థమందును - ణిజర్థమందును ఇంచు అనునాగమం బంత్యావయవముగా వచ్చును. ఉ. పోషించు-పోషింపించు. మొ.

౮. దేశ్యక్రియలకు ణ్యర్థంబునమాత్ర మీయాగమంబు వచ్చును. ఉ. కొట్టించు-రావించు. మొ.

౯. సమస్త క్రియలకు వర్తమానార్థమందు చువర్ణంబు ఆగమంబుగా వచ్చును.

౧౦. క్రియలకు వర్తమానార్థమందు ఉన్న అను శబ్దంబును భవిష్యదర్థంబున కల అను శబ్దంబును అనుబంధము లగును.

౧౧. మహత్తు కర్తయైనపుడు ఉన్న అనుశబ్దమునకు దీర్ఘంబు వచ్చును.

౧౨. మహత్తు కర్తయైనపుడు వర్తమానార్థమందును - భవిష్యదర్థమందును-వ్యతిరేకార్థమందును క్రియాపదంబుల ప్రథమ పురుషైక వచనంబునకు డువర్ణకంబు వచ్చును. ఉ. పోషించుచున్నాఁడు-వండుచున్నాఁడు-వండఁగలఁడు-వండఁడు. మొ.

౧౩. అనుబంధము - ప్రార్థనార్థము - ణిచ్చు - వ్యతిరేకార్థము-తుమున్నర్థము ఇవి పరమగునపుడు ఇంచుగాగమసంబంధియగు చకారంబునకు పకారాదేశంబు వచ్చును. ఉ. పోషింపఁ

గలఁడు-పోషింపుము - పోషింపింపుము-పోషింపఁడు - పోషింపఁగ-
వండింపఁగలఁడు. మొ.

౧౮. అమహత్తు కర్తయైనపుడు వర్తమానార్థకప్రథమపురు
షైకవచనబహువచనములకుఁ గ్రమంబుగ ది-వి అను వర్ణకం
బులును - భవిష్యదర్థమందును - వ్యతిరేకార్థమందును ప్రథమ
పురుషైకవచన బహువచనములకు దు-వు అను వర్ణకంబులును
వచ్చును. ఉ. పోషించుచున్నది - పోషించుచున్నవి. వండుచు
న్నది - వండుచున్నవి. పోషింపఁగలదు - పోషింపఁగలవు. వండఁ
గలదు-వండఁగలవు. పోషింపదు - పోషింపవు - వండదు - వం
డవు. మొ.

౧౯. సమస్తక్రియలయందును అన్ని యర్థములయందును
మధ్యమ పురుషైకవచనమునకు వువర్ణకంబును-ఉత్తమపురుషైక
వచనబహువచనములకు ను-ము వర్ణకంబులును-తక్కిన బహు
వచనములకు రువర్ణకంబును వచ్చును. ఉ. పోషించుచున్నావు-
పోషింపఁగలవు - పోషింపవు - పోషింతువు - పోషించుచున్నా
ను-పోషించుచున్నాము - పోషింపఁగలను - పోషింపఁగలము -
పోషింపను - పోషింపము-పోషింతును - పోషింతుము - పోషిం
చుచున్నారు - పోషించుచున్నారు - పోషింపఁగలరు - పోషిం
పఁగలరు- పోషింపరు - పోషింపరు - పోషింతురు - పోషింతురు-
వండుచున్నావు - వండుచున్నాను - వండుచున్నాము - వండుచు
న్నారు. మొ.

౧౬. భూతార్థమందును - తద్ధర్మార్థమందును ప్రథమపురుషైకవచనంబునకు లోపంబు వచ్చును.

౧౭. భూతార్థమందు ప్రథమపురుషైకవచనంబున ధాత్వంత్యోకారంబునకు ఎకారాదేశంబు వచ్చును. ఉ. పోషించెను-పోషించును - వండెను - వండును. మొ.

౧౮. భూతార్థమందును - క్త్వా ప్రత్యయార్థమందును - క్రియాంత్య వర్ణమునకు ఇకారాదేశంబు వచ్చును. క్త్వా. ఉ. పోషించి-వండి. మొ.

౧౯. భూతార్థక మధ్యమోత్తమపురుషములయందు తివర్ణంబును-తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనముతప్పఁ దక్కిన పురుషములయందు దువర్ణంబును వచ్చును. త. ఉ. వండుదురు. వండుదువు - వండుదురు - వండుదును - వండుదుము.

౨౦. భూతార్థక క్రియాపదంబులమీఁది వు-రు - ను-ము అను వర్ణకములయందలి ఉకారమునకు ఇకారాదేశంబు వచ్చును. పోషించిరి-పోషించితివి - పోషించితిరి-పోషించితిని - పోషించితిమి-వండిరి - వండితివి. మొ.

౨౧. వ్యతిరేకార్థమందును భవిష్యదర్థమునందును తుమున్నర్థమందును క్రియాంత్యవర్ణమునకు అకారాదేశంబువచ్చును. ఉ. వండఁడు-వండఁగలఁడు-వండన్. మొ.

౨౨. తద్ధర్మాగమందు దువర్ణంబు పరంబగునపుడు ఇంచుగాగమసంబంధి చువర్ణకంబునకు లోపంబును - బిందుపూర్వక

దువర్ణకంబునకు తువర్ణాదేశంబును వైకల్పికముగా నగును. పోషింతురు-పోషింతువు - పోషింతురు - పోషింతును - పోషింతుము-వండింతురు. మొ.

౨౩. తద్ధర్మార్థకరూపాంతరంబునఁ గ్రియాంత్యవర్ణంబునకు ఎకారాదేశంబును - ప్రథమపురుషైకవచనమందు ద్రుతాంతంబులగు-డి-డు వర్ణకంబులును-రు-వు-ను-ము వర్ణకములు పరములగునపుడు దకారంబు వచ్చును. ఉ. పోషించెడిన్-పోషించెడున్ - పోషించెదరు-పోషించెదవు - పోషించెదరు - పోషించెదను-పోషించెదము-వండెడిన్-వండెడున్-వండెదరు. మొ.

౨౪. ప్రార్థనార్థక మధ్యమపురుషైకవచన బహువచనములకుఁ గ్రమముగా ము-డు వర్ణకంబులు వచ్చును. ఉ. పోషింపుము-పోషింపుఁడు-వండుము-వండుఁడు. మొ.

౨౫. ఏకవచనమునందు వచ్చునట్టి ముర్ణకము హల్లుపరంబగునపుడు వైకల్పికంబుగ లోపించు. ఉ. పోషింపుము నీవు-పోషింపు నీవు-వండుము నీవు-వండు నీవు. మొ.

౨౬. ప్రార్థనార్థక ము-డు వర్ణకంబులకంటె - అ - ఆ - ఇ - ఈ-లు వైకల్పికంబుగఁ బ్రయోగింపఁబడును. ఉ. పోషింపుమ-పోషింపుఁడ-పోషింపుమా - పోషింపుఁడా - పోషింపుమి - పోషింపుఁడి - పోషింపుమీ - పోషింపుఁడీ - వండుమ-వండుఁడ - వండుమా-వండుఁడా-వండుమి-వండుఁడి - వండుమీ - వండుఁడీ. మొ.

౨౭. వ్యతిరేకార్థక మధ్యమపురుషంబునకు ఎ-ఏ-ఒ-ఓ-అయ్య-అమ్మ అనునవి ప్రార్థనాద్యోతకములు గా వచ్చును. ఉ. పోషింపవె - పోషింపరె-పోషింపవే - పోషింపరే-పోషింపవో-పోషింపరో - పోషింపవో - పోషింపరో - పోషింపవయ్య-పోషింపరయ్య - పోషింపవమ్మ - పోషింపరమ్మ - వండవె-వండరె-వండవే-వండరే-వండవో - వండరో-వండవో - వండరో - వండవయ్య-వండరయ్య-వండవమ్మ-వండరమ్మ. మొ.

౨౮. ఉభయకర్తృక ప్రార్థనార్థకంబునకు మువర్ణకంబు పరంబగునపుడు దకారంబు పూర్వాగమంబుగా వచ్చును. ఉ. పోషింపుదము-పోషింతము-వండుదము. మొ.

౨౯. వ్యతిరేక ప్రార్థనార్థకంబున ము - డు వర్ణకంబులు పరంబగునపుడు కువర్ణకంబు పూర్వాగమంబుగా వచ్చును. ఉ. పోషింపకుము-పోషింపకుఁడు-వండకుము-వండకుఁడు. మొ.

౩౦. సమస్తక్రియాపదముల యంతమందు భావార్థమున టవర్ణకంబు వచ్చును. ఉ. పోషించుట-వండుట. మొ.

౩౧. వ్యతిరేకభావార్థమందు మివర్ణకంబు వచ్చును. ఉ. పోషింపమి-వండమి. మొ.

౩౨. క్త్వార్థక రూపముమీఁద్గ అకారంబును కవర్ణకమును వచ్చి వ్యతిరేకక్త్వార్థకమగును. ఉ. పోషింపక-వండక. మొ.

౩౩. ధాతువుమీఁద ద్రుతసహితంబగు చువర్ణకము వచ్చి శత్రర్థకమగును. ఉ. పోషించుచున్-వండుచున్. మొ.

౩౮. ధాతువుమీఁద ద్రుతసహితంబగు డువర్ణకము వచ్చి అసంఖ్యార్థకమగును. ఉ. పోషించుడుఁ-వండుడుఁ. మొ.

౩౯. ధాత్వంతోకారమునకు ఇకారాదేశంబును - ద్రుత సహిత నకారంబును వచ్చి చేదాద్యర్థకమగును. ఉ. పోషించినఁ-వండినఁ. మొ.

౪౦. ధాతువుమీఁద చువర్ణకము ఉన్న అనుదానితోఁ జేరి వచ్చి వర్తమానార్థకవిశేషణమును - క్త్వార్థకక్రియారూప ముమీఁద నవర్ణకము వచ్చి భూతార్థకవిశేషణమును - తుమున్నర్థక క్రియారూపముమీఁద కల అనునది వచ్చి భవిష్యదర్థక విశేషణమును-ధాతురూపమును మీఁద ఎడి-ఎడు ప్రత్యయములు వచ్చిన రూపములును తద్ధర్మార్థక విశేషణములు నగును. ఉ. పోషించుచున్న - వండుచున్న-పోషించిన-వండిన-పోషింపఁగల-వండఁగల - పోషించు - పోషించెడి-పోషించెడు - వండు-వండెడి-వండెడు. మొ.

౪౧. ధాతువుమీఁద అకారమును నివర్ణకంబునువచ్చి వ్యతిరేకార్థక విశేషణమగును. ఉ. పోషింపని-వండని. మొ.

౪౨. క్రియలకు కర్మార్థమందు పడుశబ్దం బనుబంధకంబగును. దానిమీఁద కర్తృప్రయోగమునకువలె ఉన్నాను బంధము మొదలగు కార్యములు వచ్చును. పోషింపఁబడుచున్నాఁడు-పోషింపఁబడియెను-పోషింపఁబడఁగలఁడు- వండఁబడుచున్నాఁడు-వండఁబడియెను - వండఁబడఁగలఁడు. మొ.

౩౯. ణిజర్థకమునకు మునుపటివలె నించుగాగమంబును - అనుబంధాదులును వచ్చును. ఉ. పోషించుచున్నాఁడు - వండించుచున్నాఁడు. పోషించెను-వండించెను. మొ.

కొన్ని ధాతువులు నానావిధములుగా ణిజంతము లగుచున్నవి.

| ధాతువు-ప్రేరణ కర్త్రర్థకము | ధాతువు-ప్రేరణ కర్త్రర్థకము |
|---|---|
| కడుచు-కడవు | పూను-పూనుచు-పూనించు |
| విఱుగు-విఱుచు | తేలు-తేలుచు-తేలించు |
| మేయు-మేపు | కుదురు-కుదురుచు-కుదిరించు |
| లేచు-లేపు | విను-వినుచు-వినిపించు |
| తెలియు-తెలుపు | మను-మనుచు-మనిపించు |
| తిరుగు-త్రిప్పు | అడఁగు-అడఁచు-అడఁగించు |
| తునుఁగు-త్రుంచు | కరఁగు-కరఁచు-కరఁగించు |
| తిను-తినుపించు | కలఁగు-కలఁచు-కలఁగించు |
| పడు-పఱుచు | ఉడుగు-ఉడుపు-ఉడిగించు. మొ. |

౪౦. క్రియాఫలంబు కర్తృగామియగునపుడు కొనుధాతువు ధాతువున కనుప్రయుక్తంబగు; కొనుధాతువు పరంబగునపుడు ధాత్వంత్యోకారమునకు ఇకారంబు వైకల్పికముగా నాదేశం బగును. ఇదియ యాత్మనేపదార్థంబు. ఉ. పోషించుకొనుచున్నాఁడు-వండుకొనుచున్నాఁడు-పోషించుకొనుచున్నాఁడు - వండికొనుచున్నాఁడు. మొ.

౪౧. ధాతుభిన్నంబయిన శబ్దంబుమీఁద ధాతుత్వమును వివక్షించునపుడు ఇంచుగాగమంబు వచ్చును. ఉ. పల్లవించె- చిగిరించె. మొ.

౪౨. భూత తద్ధర్మార్థములయందు పశుపక్ష్యాది తిర్యక్కులును అచేతనంబులును కర్తలగునపుడు బహువచనం బేకవచనంబే యగును. ఉ. చిలుకలు రంజిల్లెఁ - చివుళ్లు విలసిల్లెఁ - చిలుకలు రంజిల్లురఁ - చివుళ్లు విలసిల్లురఁ. మొ.

౪౩. అయంతంబుగానిద్వ్యచ్ - లఘువయిన యొక యక్షరము పూర్వమునందుఁగల క్రియయొక్క అంత్యంబైన వర్ణంబునకు ఇకారాగమంబు వైకల్పికంబుగ వచ్చును. ఉ. ఘటించె- ఘటియించె-నటించె-నటియించె-వధించె-వధియించె. మొ.

౪౪. రంజఘట ఇత్యాద్యకర్మక ధాతువుల యించుగాగమ సంబంధిచు చకారంబులకు రెండు లకారంబులు సంశ్లిష్టంబులై యాదేశంబులగును. ఉ. రంజిల్లు-ఘటిల్లు-విస్తరిల్లు. మొ. తద్భవములందును గలదు. ఉ. అవటిల్లు-నివ్వటిల్లు. మొ.

౪౫. ద్విత్వంబులేకయును ప్రయోగంబులు గలవు. ఉ. రంజిలు - నివ్వటిలు.

౪౬. రంజి ఘట ధాతువులకు ణిచ్చు పరంబగునపుడు లద్వయాదేశంబు గలదు. ణిజర్థంచుగాగమము పరమగునపుడు లకారద్వయా దేశయోగ్యంబు స్వార్థంచు గాగమమునకు

లోపంబు గలుగును. ఉ. రంజించె మమ్ము-ఘటించె సత్కార్యము. మొ.

౪౭. తత్సమ క్రియలకువలె దేశ్యక్రియలకును అనుబంధాదులు వచ్చును.

౪౮. క్రియాపదంబులమీఁద ఏకార ఆకారములు ప్రశ్నద్యోతకములుగా వచ్చును. ఉ. నన్నుఁజూచితివే - నన్నుఁబ్రోచితివా? మొ.

౪౯. సందేహార్థమందు ఓకారంబు వచ్చును. ఉ. చూచునో-చూడఁడో? మొ.

౫౦. ఆశీరర్థంబున ధాతువునకు ఎడు, త, వర్ణకంబులు వచ్చును. ఉ. పోషించెడు౯ - పోషించుత౯ - వందెడు౯ - వందుత౯. మొ.

౫౧. తద్ధర్మార్థకముకంటె కాత-కావుత-కాక అనునవి ఆశీరర్థంబున ననుప్రయుక్తంబులగును. ఉ. పోషించుఁగాత౯ - వందుఁగాత౯-పోషింతురుగాత౯ - వందుదురుగాత౯ - వందుఁగావుత౯ - వందుదురుగావుత౯. మొ.

౫౨. ఒకానొకచోఁ గేవలతద్ధర్మార్థకంబును ఆశీరర్థంబునం బ్రయోగింపఁబడును. ఉ. నాయఘంబులఁ బోఁగొట్టునందనుతుఁడు. మొ.

౫౩. ప్రథమాదిపురుషములందును - వర్తమానాది అర్థములయందును - ఏకవచనాదివచనములయందును వర్ణాగమంబు

విశేషముగా వచ్చును. చేసెను - చేసిరి-చేసెడిని - చేసెదును-చేసెదరు-చేసి-చేసినను-చేసిన. ఉన్నాఁడు-ఉన్నారు - ఉంటివి - ఉంటిరి-ఉందురు-ఉందము - ఉంట - ఉన్నను-ఉంచుచున్నాఁడు-ఉంచుచున్నారు. రాఁగలఁడు - రాఁగలరు-వత్తురు-రమ్ము - రండు-వత్తము-రాఁడు-రారు-రాము-రాకుఁడు-రప్పించుచున్నాఁడు - రావించుచున్నాఁడు - రప్పించుచున్నారు - రావించుచున్నారు - చూడఁగలఁడు-చూడఁగలరు - చూతురు - చూడుము-చూడుఁడు-చూడఁడు-చూడరు - చూడమి. కలఁడు - కలరు - లేఁడు-లేరు-లేమి-లేక. మొ.

---

## అభ్యాసము.

ధాతువు లెన్ని విధములు? తత్సమక్రియ లెన్నివిధములు? ఈ క్రింది పదములలోని తత్సమదేశ్య క్రియలను వివరించి చెప్పుము. చేయు-సృజించు-కొట్టు-రంజించు - వ్రాయు - బోధించు - తెగించు - తిరియు - మురియు-కోయు - నయించు - అనుసరించు - సంభవించు - పులకరించు - ఆవులించు-అంగలించు - త్రెంచు. మొ.

క్రిందిపదములలోని ప్రథమమధ్యమోత్తమపురుషములను వివరింపుము. మఱియును కాలములను-అర్థములను - వచనములను నయితము వివరింపుము.

నుతించుచున్నాఁడు- వ్రాయుచున్నాఁడు-చూచుచున్నావు - కోయుచున్నాము-తీయుము-వండవు - వ్రాయకుము - అందము.

చేయుదము - వండెదురు - వండెదిరి - వండుదురు - వండఁగలవు-వండను - వండము-కోయను - చూచెను-చూచితిని - చూచితివి.

ఈ క్రిందిపదము లేయేయర్థములయందు వచ్చినవో చెప్పుము.

వ్రాయుట-వ్రాయక-వ్రాసినను - వ్రాయు - వ్రాయుచును - వ్రాయుమి- వ్రాసెడి-వ్రాయుచున్న - వ్రాయఁగల - వ్రాసిన-వ్రాయుదురు.

ఈ క్రిందిపదములను సూత్రములు చెప్పి నిర్వచింపుము.

వండని - పోషించుచున్నాఁడు - వండుఁడు - చేయుము - వ్రాసి-పోషింపుము - పోషింపించు-పోషింపఁబడఁడు - పోషించుకొను - పోషింపింపఁబడుచున్నాఁడు.

భవిష్యదర్థమందు వచ్చునట్టియనుబంధ మేమి? వర్తమానార్థమం దేది? తద్ధర్మము-భూతము-భవిష్యత్తు-వర్తమానము వీనిని నిర్వచింపుము. భావార్థము - చేదర్థము-తుమున్నర్థము - వ్యతిరేకక్త్వార్థము - ప్రార్థనార్థము వీనియందు వచ్చునట్టివర్ణకములను జెప్పుము.

చిలుకలు రంజిల్లెను - చివుళ్లు విలసిల్లును - వీనిమీఁదఁ గొంత చర్చ చేయుము.

క్రియాపరిచ్ఛేదము సంపూర్ణము.

---

చెన్నపురి, ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు ముద్రితము:—1916

# ఆంధ్ర గ్రంథములు.

---

| | | | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|---|---|
| ఆంధ్రమహాభారతము, పద్యకావ్యము:— | | | | |
| ఆదిసభాపర్వములుగల | సంపుటము | ... | 2 | 4 |
| డిటో అత్యుత్తమప్రతి | ,, | ... | 3 | 8 |
| అరణ్యపర్వము | ,, | ... | 2 | 4 |
| డిటో అత్యుత్తమప్రతి | ,, | ... | 3 | 8 |
| విరాటోద్యోగపర్వములు | ,, | ... | 2 | 4 |
| డిటో అత్యుత్తమప్రతి | ,, | ... | 3 | 8 |
| భీష్మద్రోణ పర్వములు | ,, | ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ,, | ... | 2 | 4 |
| శాంతిపర్వము | ,, | ... | 2 | 4 |
| అనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణపర్వములుగల సంపుటము | | ... | 2 | 4 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | | ... | 6 | 8 |
| యుద్ధపంచకము | ,, | ... | 4 | 4 |
| శాంతిసప్తకము | ,, | ... | 4 | 4 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది. సూర్యనారాయణ శాస్త్రిగారిది | | ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | | ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు | | ... | 0 | 2 |
| భాస్కరరామాయణము,చక్కనికూర్పు, అత్యుత్తమప్రతి | | ... | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | | ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు. లక్ష్మణకవికృతము | | ... | 1 | 8 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | | ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము | | ... | 2 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, క్రొత్తకూర్పు | | ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు | | ... | 5 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కగ ముద్రితము | ... | 0 | 10 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకుముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది గిల్టుబైండు... 2 వాల్యములు అత్యుత్తమప్రతి | ... | 8 | 0 |
| మనుచరిత్ర, సటీక | ... | 2 | 0 |
| వసుచరిత్రవిమర్శనము | ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు | ... | 8 | 8 |
| ఆముక్తమాల్యద, „ | ... | 8 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| హరవిలాసము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 2 |
| రామాభ్యుదయము | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 12 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము | ... | 0 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర | ... | 1 | 8 |
| „ కాలికోబైండు | ... | 1 | 14 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| „ కాలికోబైండు | ... | 0 | 8 |
| పారిజాతాపహరణము, సాధారణప్రతి | ... | 0 | 4 |
| డిటో మేలుకాకితములు, చిన్నసైజు, క్రొత్తకూర్పు | ... | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | ... | 0 | 12 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 2 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 4 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము | ... | 2 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 2 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగ్గడ క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 2 |
| బిల్హణీయము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, | ... | 0 | 8 |
| రసికజనమనోభిరామము | ... | 0 | 12 |
| ఆంధ్రలలితోపాఖ్యానము | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 0 | 12 |
| కవిచౌడప్పశతకము | ... | 0 | 2 |
| అంబరీషోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 10 |
| రుక్మిణీకల్యాణము, సటీక | ... | 0 | 8 |
| శ్రీవివేకానందవిజయము | ... | 1 | 12 |
| ప్రాచీనదేశచరిత్రలు | ... | 1 | 12 |
| భారతరమణీమణులు | ... | 0 | 12 |
| డిటో 2-భాగము | (అచ్చగుచున్నది.) | | |
| శ్రీమహాభక్తవిజయము | ... | 4 | 0 |
| భోజకాళిదాసకథలు 1-వ భాగము | ... | 0 | 12 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | ... | 0 | 1 |
| రేచుక్క పగటిచుక్కకథలు | ... | 0 | 3 |
| మర్యాద రామన్నకథలు | ... | 0 | 2 |
| సత్యసేనవిజయము, శ్రీ కో. అనంతాచార్యకృతము | ... | 0 | 4 |

72

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఈసపునీతికథలు, క్రొత్తకూర్పు 1-వ భాగము ... | 0 | 6 |
| డిటో 2-వ భాగము ... | 0 | 8 |
| షేక్స్పియర్ నాటకకథలు, సులభశైలి ... | 1 | 8 |
| పరిహాస్యవినోదకథలు ... | 0 | 12 |
| అరేబియన్‌నైట్సుకథలు, చక్కనికూర్పు ... | 1 | 4 |
| లార్డుక్లైవు జీవితము ... | 0 | 8 |
| శ్రీ గురుజాడ, శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు ... | 3 | 8 |
| తారాబాయి, చక్కనినవల, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| ఊలారామ ,, ,, ... | 1 | 4 |
| అస్తమయము ,, ,, ... | 1 | 8 |
| సీతారామము, తల్లాప్రగడ. సూర్యనారాయణరావు ... | 1 | 4 |
| ఆనందమఠ, నవల, నూతనముద్రితము ... | 0 | 12 |
| కపాలకుండల, నవల ... | 0 | 14 |
| సాంఘిక దౌర్జన్యము ... | 0 | 14 |
| విజ్జలదేవి ... | 1 | 2 |
| దుర్గేశనందని, నవల, సాధారణ ప్రతి ... | 0 | 8 |
| ఐవన్హో, నవల, క్రొత్తకూర్పు ... | 0 | 8 |
| మదాలస ,, ... | 0 | 10 |
| సుజనరంజని ,, ... | 0 | 8 |
| టిప్పుసుల్తాన్ ,, ... | 1 | 4 |
| మనోహారి ,, టి. యస్. రామశాస్త్రిగారిది ... | 0 | 12 |
| రోషినార, చరిత్రవిషయకమగు నవల ... | 0 | 12 |
| భోజునికథలు ... | 0 | 8 |
| విక్రమార్కునికథలు ... | 0 | 8 |
| బేతాళునికథలు ... | 0 | 8 |
| పరమానందశిష్యులకథలు ... | 0 | 8 |
| వైద్యులకథలు ... | 0 | 4 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | TPCA102B2000 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 77 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | ci, 2, -, Bci |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Kaveed |
| పరీక్ష చేసినది | lakshmi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |